త్వరలో!



శ్రీదేవి ప్రొడక్షన్స్ వారి

# భువనసుందరి కథ

స్క్రీన్‌ప్లే-మాటలు: బి.ఎల్.ఎన్.ఆచార్య. ఛాయ: సి.నాగేశ్వరరావు

కూర్పు: బి.గోపాలరావు   కళ: వాలి

దర్శకత్వం: సి.పుల్లయ్య · సంగీతం: ఘంటసాల · నిర్మాత: తోట సుబ్బారావు

పూర్ణా రిలీజ్

NAVRANG

STUDIO KETHA



* డాక్టర్లు సిఫారసుచేసే అసాధారణమైన క్రిమిసంహారక మొటిమల మందు.
* చక్కని సువాసన.




**MEDICATED PIMPLE CREAM**

## (నిటాల్ మొటిమల మందు)

నిటాల్ మొటిమల మందు సురక్షితంగా, హాయిగా, పూర్తిగా మొటిమలను తొలగిస్తుంది. చర్మంలోనికి పోయి, ముందు ముందు తిరిగి మొటిమలను లేవకుండా చేస్తుంది. లోపలికంటా పోవడంవల్ల మొదలంటా మొటిమలను తీసివేస్తుంది. మొటిమలు ఎండి పడిపోగలవు. దీన్ని వాడిన తర్వాత ఇతర దోషాలేమీ వుండవు. మచ్చలుగాని, గుంటలుగాని పడవు.

యువతీ యువకులందరూ వాడవచ్చు. చర్మాన్ని శుభ్రపరచి, మనసు తేల్చి నిగనిగలాడుతూ యౌవనం ఉట్టిపడేటట్లు చేస్తుంది.

వాడే విధము—ప్యాకెట్‌లో వున్నది




ఉత్పత్తిదారులు:
**కొచ్చిన్ పామ్ ప్రైవేట్ లిమిటెడ్**
నవరత్న హౌస్, షణ్ముఖ రోడ్, కొచ్చిన్-2.

మద్రాస్, ఆంధ్రప్రదేశ్, మైసూర్ అండ్ కేరళ రాష్ట్రములకు డిస్ట్రిబ్యూటర్లు:
గణపతి అండ్ కం., 103-104, లింగిచెట్టి స్ట్రీట్, పోస్టు బాక్సు నం. 1986, మద్రాస్-1.

ప్రఖ్యాత కెమిస్టులందరివద్ద లభించును.




భరణీ పిక్చర్స్

# గృహలక్ష్మి







హాస్య రస ప్రధాన సాంఘిక చిత్రం

నిర్మాత-దర్శకుడు: రామకృష్ణ





Roopkala

నవయుగ

# ఉత్తరాలు

### ముఖచిత్రం

24—3—67 వ పత్రిక ముఖచిత్రం చాలా ఆకర్షణీయంగా వున్నది. వనితా లోకంలో గాలి విజయలక్ష్మి వ్రాసిన "నాకు తెలిసిన అమెరికా" వ్యాసం చాలా బాగా వున్నది. యింకా విదేశాల అనుభవాలను సోదరీమణులు మీ పత్రికద్వారా మాకు అందజేయగలరని ఆశించుచున్నాను.

పి. హైమవతి (అమలాపురం)

### కథలు

'మిగిలిందేమిటి', 'వైజయంతి' పాఠకుల హృదయాన్ని క్షణక్షణానికి ఏదో చెప్పరాని, ఆవేదనకు ఆతురతకు కట్టి వేశాయి.

వైజయంతిలో రాజు మనసు నిజంగా మేము చూచిన కొన్ని హృదయాల కథకు దగ్గర అన్పించింది. వాస్తవానికి దగ్గరగా నున్న 'వస్తువు'ను కథగా చిత్రీకరించిన శ్రీ హవిస్ అభినందనీయుడు.

కామేశ్వరిగారి సిరెండలు, లాల్‌గారి ఆఖరిఘడియలు బాగున్నవి. సీరియల్స్‌లో ముఖ్యంగా రామశాస్త్రి చాలా బాగున్నది, కొద్ది కొద్దిగా వేస్తూ పాఠకుల హృదయాల్ని బాధపెట్టటం బాగుండలేదు. దానికి మరి రెండు పేజీలు కేటాయిస్తారని ఆశిస్తున్నాము.

ఈ వారం సాహిత్య అకాడమి బహుమతి గ్రహీతలగూర్చి వ్రాసినందులకు చాల సంతోషం. బార్వే గురించి వ్రాసిన శ్రీ సుకాంతకర్‌కి కృతజ్ఞత. వూమెన్‌కార్టూను, కార్టూన్లు బాగున్నాయి. బేగం హజ్రత్ మహల్ గురించివ్రాసింది కూడా శ్రీసుకాంతకర్ అని అనుకుంటున్నాము. క్రొత్తనటి శ్రీదేవి ఫోటోలు అదృశ్యంగా వున్నాయి. సినిమా ఫోటోలు ప్రింట్ చేసేపుడు కొద్ది జాగ్రత్త తీసుకుంటారని ఆశిస్తాము.

ముఖచిత్రం పేరు తెలియజేయలేదు. పత్రికలో అక్కడక్కడ అక్షరాలు ముద్రణ పడలేదు.

గోపి, హృషి, వెంకట్, మృతన్ (వనపర్తి)

* * *

ఇ. సరస్వతీదేవిగారి 'విచ్చిన మబ్బులు' అనే కథ నాకెంతో నచ్చింది. అర్ధాంగిని అనుమానించే వారికి ఇదొక చక్కని గుణపాఠము. విషయ మేమిటో పూర్తిగా అర్థము చేసుకొననిదే, అనుమానించడము ఎలాటిదో ఈ కథ చక్కగా వివరిస్తుంది. ముఖచిత్రాలు సినీతారలవి తగ్గించి, ఏవైన చక్కటి సహజమైన చిత్రాలు వేస్తే బావుంటుందేమోనని అనుకుంటాను. వూమెన్ కార్టూన్లు బావున్నాయి.

వి. ప్రభాకర్ కుంటాల
(విజయనగర్ కాలని)

### సీరియల్

ఈ వారం 24—3—67 పత్రికలో 'జాహ్నవి హైమవతులు'' సీరియల్‌లో ఒకచోట "ఏన్యువల్ పరీక్షలలో ఆఖరి పరీక్ష రాసేసి ఎంతో ఉల్లాసంగా నీరజతో ఇంటికి కొచ్చింది మనోరమ. తల్లిముఖం చూసి వెల వెల పోయింది. నీరజ కూడా అలా ఉన్నావేం పిన్నీ?" అని అడిగింది.

"ఏం. లేదు అంది హైమ శాంతంగా ........" అని వుంది.

నీరజకు హైమ పెద్దమ్మ అవుతుంది కాని పిన్ని ఎలా అయ్యిందో అర్థంకాలేదు. ఇది రచయితగారి పొరపాటో లేక అచ్చుతప్పో తెలియ చేస్తారని ఆశిస్తున్నాము.

వూమెన్ కార్టూన్‌లో శ్రీమతి ఇందిరా గాంధి, శ్రీ మొరార్జీదేశాయ్‌గార్లు పడవలో వెనుకకు తిరిగి కూర్చున్నట్లు చూపించారు. లేకపోతే పడవను వెనుకకు నడుపుతున్నట్లుగా చూపించారు. అది కూడ పొరపాటేనా? లేక 'పార్టీ సమస్యలు' అనే సుడిగుండంలో పడవ చిక్కుకుంటుందని వూమెన్‌గారి జోస్యమా?

—డి.ఎస్.ఆర్. మూర్తి (వాల్తేరు)

### కార్టూన్లు

24.3.67 సంచికలో "ఉత్తరాలు" శీర్షికలో ఒక సోదరుడు వ్రాసిన ఉత్తరం చదివాక ఇది వ్రాయాలనిపించింది.

ఆ సోదరుడు వ్రాశాడు కదా........ పత్రికల్లో భర్తను భార్య కొట్టినట్లు 'కార్టూన్లు' వేస్తున్నారు. అంత గయ్యాళి భార్యలు ఎవరూ లేరు కావున ఇక ముందు అటువంటి కార్టూనులు ప్రచురించ గూడదు!' అని.

అసలు కార్టూనులు వేసేవన్నీ నిజంగా జరిగే సంఘటనలేనా.....? అలాగయితే ఈ సంచికలో 'జయదేవ్'గారు వేసిన రెండు కార్టూన్లలో ఉన్నట్లుగా నిజ జీవితంలో జరుగుతుందా......?

కార్టూనులు వేసేది కేవలం వినోదం కోసమేనని....... అవి నిజసంఘటనలు కావనీ, కేవలం కల్పితాలని చాలావరకు ముఖ్యంగా ఈ సోదరుడు గమనించాలి......!

కె. బి. యాదగిరి (లింగాల ఘణపూరం)

* * *

మీరు మీ వారపత్రికలో ప్రకటిస్తూ వుండే కార్టూనులలో స్త్రీలపై వ్యంగ్యంగా దెబ్బతీసేవి మరీ విచిత్రంగాను, విపరీత మైన అతిశయోక్తులతోనూ కూడివున్నాయి. ప్రబంధకాలపు కవుల అతిశయోక్తులను తల దన్నుతున్నాయి. ఇలాంటి ప్రకటనల వల్ల సత్యదూరమైన హాస్యాన్ని అందించే దలచి మీరు హాస్యాస్పదులవుతున్నారనే సంగతి మరిచిపోవద్దు.

—కె.ఎస్. సావిత్రి (వేరాపురం)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక


వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం : 7—4—'67
పరాభవనామ సం॥ ఫాల్గుణమాసం బహుళ త్రయో॥
సంపుటము : 59 సంచిక : 30

స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీథి, మద్రాసు-1

చందా వివరాలు : 10-2-1967 మొదలు
భారతదేశం

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 22.40 |
| 6 మాసముల చందా | 11.20 |
| 3 మాసముల చందా | 5.60 |
| విడిప్రతి | 0.40 |

ఇతరదేశాలకు
ఓడమీద (Sea Mail)

| | |
|---|---|
| సంవత్సర చందా | 42.00 |
| అర్ధసంవత్సర చందా | 21.00 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం: నటి జయలలిత.
(ఫోటో: ప్రభాకర్)





## శ్రీమతి ఇందిరాగాంధీ యుజమాయిషీలో

# అమాత్యుల అంబారీ

క్రొత్త ప్రభుత్వం పోకడ ఎలా వుంటుందో తెలియపరుస్తూ మొదటి ప్రకటన వెలువడింది. ఆ ప్రకటన ఎంతో వివరంగా వుంది. అందులో బరువైన భాష బాగానే వుందిగాని, వ్యూహాగానాలు, అర్థరహితమైన వాగ్దానాలు ప్రకటనని విస్తారం చేసేశాయి.

ఇది కాంగ్రెసు ప్రభుత్వం కార్యాలయాల్ని అధివసించిన తర్వాత మొట్టమొదటి ప్రసంగం. ఒక విధంగా చూస్తే మొన్నటి పార్లమెంట్రీక ఎన్నికల కోసం తయారు చేసుకున్న పథకానికి ఇది ప్రతిరూపమైన ప్రణాళిక! అసలు ప్రణాళికకు వ్యాఖ్యానం చేయడానికి ఈ ప్రసంగం ఎంతవరకు సహకరిస్తుందీ అనేదే ప్రశ్న. ప్రణాళికలో కావలసినన్ని పేక మేడలున్నాయి. ఎండమావులున్నాయి. వాటి మీద నినాదాలున్నాయి. వీటికి రూపం నిర్మించాలంటే ఎంతటి కృషి చేయవలసి వుంటుందో అందరికీ తెలుసు. మంత్రివర్గ నిర్మాణాన్ని తీసుకుందాం. అది పోష[illegible] ధర్మాన్ని నెరవేర్చాలనే కదా మన వాద సిద్ధాంతం ? ఛోటా రాజాలతోను, ఒకింత దళ్లతోను గుమిగూడిన మంత్రివర్గం ఈ విధానాన్ని ఎంతవరకు అనుసరిస్తుంది? మనకు తేటతెల్లమయేదేమిటంటే, మదామ్ గాంధికి వారి తండ్రిగారిలా సోషలిజం మంత్రోచ్చారణ మీద అట్టే నమ్మకం లేదని!

మదామ్ గాంధి ఒక సంపుష్టమైన విధానాన్నుంచి ఆర్థిక పరిస్థితిని వెనక్కు నెట్టుతున్నా రనడానికి దృష్టాంతం కావాలంటే వారి మంత్రివర్గ నిర్మాణమే చాలు. మంత్రుల నివాసాల్లో ఆహారపదార్థాలు విపరీత ధరల నిమిత్తం లేకుండా ఎంత పొదుపుగా వాడబడుతున్నాయో(!) చూస్తే ప్రజలకు మొత్తం ఆహార సమస్యమీద, పరిపాలకులమీద, ఎటువంటి విశ్వాసం ఏర్పడుతుందో వేరుగా చెప్పనక్కరలేదు! పరిపాలకులు మార్గదర్శకం కాకపోతే ప్రజలు దారితప్పి నడుస్తా రనడానికి ఏమాత్రమూ సంశయంలేదు. ధరల్ని అదుపులో పెట్టాలి, పొదుపు పాటించాలి! అవేవి మన ప్రభుత్వ నినాదాలు. ప్రజలకు చెప్పే హితవచనాలు. ఇప్పుడు శ్రీమతి ఇందిరా గాంధి ప్రభుత్వాన్ని తీసుకుందాం. పొదుపును గురించి వారెలాంటి చర్యలు తీసుకున్నారో చూద్దాం. భారతదేశం సమస్యలపుట్ట. ఒకటి పరిష్కారమైతే మరిన్ని తయారవుతాయి. ఈ విషయం తెలిసి కూడా శ్రీమతి ఇందిరాగాంధి మంత్రివర్గాన్ని వీలైనంత తక్కువలో ఎందుకు నిర్మించుకోలేకపోయారట?

ఒక కాంగ్రెసు వ్యక్తికి ఉద్యోగం ఇవ్వవలసి వచ్చి ఇదివరలో మదామ్ గాంధి ప్రభుత్వం 'సప్లయ్, అండ్ టెక్నికల్ డెవలప్‌మెంట్' పేరుతో ఒక మంత్రిత్వాన్ని ఉద్భవింపజేశారు! 'వర్క్స్, పరిశ్రమల' మంత్రిత్వశాఖల అధీనంలో ఉన్న వాటిని వూడదీసి ఒకటిగా కేటాయించవలసి వచ్చింది! ఆ కార్యకర్తకు ఈసారి చోటు లేకపోయింది. అంచేత క్రొత్త శాఖను రద్దుచేసి యథాస్థానంలో వుంచేశారు. ఆ శాఖకు ఒక కార్యదర్శిగారు ఉన్నారుగా మరి! అదృష్టం ఎలా వుందోగాని, ఆయన వీసమేషాలు లెక్కించుకుంటూ కూర్చున్నారు!

అదలా వుంచి, పార్లమెంటరీ వ్యవహారాలకు ఒక మంత్రిగారున్నారు, ఒక రాష్ట్ర మంత్రి ఉన్నారు. శ్రీవారికి మరో ముగ్గురు తోడు మంత్రులున్నారు. దీనికి సాయం ఇరిగేషన్ శాఖకు ఒక రాష్ట్రమంత్రి, విదేశీ వ్యవహారాలకు ఒక మంత్రిగారు, ఒక సహాయమంత్రి ఉన్నారు. ఆర్థికశాఖకు ఒక రాష్ట్రమంత్రి గారు, ఉక్కు రక్షణ శాఖలకు ఒక్కో మంత్రిగారు, ఒక్కో రాష్ట్రమంత్రిగారు ఉన్నారు. మరో సహాయమంత్రి శ్రీ సత్యనారాయణ సిన్హా గారున్నారుగాని తామెవరో, ఎందుకో ఆయనకే తెలియదు! అత్యవసర పరిస్థితిని అరచేతిలో వుంచుకున్నా, మదామ్‌గాంధీ అమెరికా విధానంలాంటి 'లాలోచీపద్ధతి'ని అవలంబిస్తూ, ఆమెకు హితులూ, సన్నిహితులూ అయిన వారందరికీ ఉద్యోగాలిచ్చి సత్కరించారూ అంటే ఎంతో హాస్యాస్పదంగా వుంటుంది! కాంగ్రెసు పార్టీకి 280 మంది సభ్యులున్నారు. ఏభయ్యిద్దరు మంత్రులున్నారు! అంటే ప్రతి 5.4 సభ్యులకు ఒక మంత్రి సహాయుడు! ఇంకా, మదామ్ గాంధి బంధుకోటిలోని కొందరి ప్రవేశానికి అవకాశాలున్నాయి!

మంత్రివర్గం సంఖ్య పదిహేను నుంచి ఇప్పటికి పందొమ్మిది వరకు పెరిగింది. క్రొత్త ప్రభుత్వం మొట్టమొదట అభివృద్ధి నెంటనే కనిపించిందన్నమాట! అది సరే, ఒకో మంత్రిగారి నివాసానికి సకల శోభితమైన ఒక భవంతినివ్వాలి. వారి దాయాదులకో ఉపగృహాన్ని అమర్చి పెట్టాలి. కార్లను ఇవ్వాలి. ఇంకా, టెలిఫోన్లు, తదితర అనంత భోగాలు వుండనే వున్నాయి.

ఇది ప్రస్తుత ప్రభుత్వపు దుర్వ్యయ వ్యాపారానికి మచ్చు తునక. విదేశాల నుంచి ఉద్యోగస్థుల నిరంతరమైన దిగుమతి మరో ఉదాహరణ. మనకు విదేశ వ్యవహారాలకు ఒక మంత్రిత్వం ఉంది. దాని కార్యకర్తగారు దేశ విదేశ సంబంధాల్ని ముడివేస్తూ వుంటారు. ఈ ముడి వల్ల మనదేశం పరువుప్రతిష్టలు ఇతరదేశాల్లో ఎలా వెరిగిపోతున్నాయో మనందరికీ తెలిసిందే!

ఈ అమాత్యుల అంబారీ పటాటోపం అంతా యింతా కాదు. ఈ కూటమిలో అందరూ అందరే. ఏ ఒక్కరూ తీసిపోకుండా బొజ్జలు పెంచుకున్నారు. ఈ 'మేళం' ఒక్కొక్కరి బొక్కసం ఎంతెంత పెట్టదో ఎవరూ వ్యక్తం చేయలేరు. ఎందుకంటే శాంత జీవనము నిజాయితీ కాంగ్రెసు యొక్క నియమాలూ నీతిసూత్రాలూను! కార్యాలయాల్ని అట్టేపెట్టి, మంత్రుల నివాసాల్లో ఉన్న గృహోపకరణాల్ని తీసుకుంటే మన పొదుపు ఉద్యమానికి సాక్ష్యాలుగా నిలబడతాయి! సుందరమైన, చేవగల ఆఫీసు బల్లల్ని 1947 ఆగస్టు 15 కు ముందున్న కార్యకర్తలు ఉపయోగించుకున్నారు. ఈ రకం బర్మా టేకు కర్ర ఇప్పుడసలు దొరకనే దొరకదు. ఎంతోమంది సభ్యులు

వచ్చారు, వెళ్ళారు, మారుతూ ఉన్నారు. ఈ తెగకు ఈ బల్లలు ఎంతో సేవచేస్తూ వస్తున్నాయి. ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే ఇప్పుడవన్నీ మాయమైపోయాయి! ప్రతి కాంగ్రెసు మంత్రిగారు ఒకర్ని మించి ఒకరు కేటలాగ్‌లో మేలురకం ఫర్నిచర్‌ని దిగుమతి చేసేసుకుంటున్నారు. కొత్త నీరు వచ్చి పాత నీరును కొట్టుకుపోతూ వుంది! ఉదాహరణకు మరో విషయం తీసుకుందాం. ఇది క్రితం సంగతి. ఘనత వహించిన ఒక మంత్రిగారున్నారు. ఆయనకు ఆఫీసుకు ఉత్తరం వైపు 'బ్లాక్' ను కేటాయించారు. అప్పుడు ఎన్నో గోడలు పడగొట్టవలసి వచ్చింది. ఎన్నో మార్పులు చేయవలసి వచ్చింది. ఇప్పుడా మంత్రిగారు కార్యాలయాన్ని ఖాళీ చేసేశారు పాపం! ఆయన వెళ్ళీ వెళ్ళగానే గోడలు మళ్ళీ యథాప్రకారం లేచిపోయాయి! ఇదంతా చూస్తుంటే మనకు ఒళ్ళు జెర్రులు ప్రాకినట్లుంటుంది. ప్రభుత్వంలో ఏ అంగం మారినా రంగస్థలమే మారిపోతూ వుంది! దాని ఖర్చు అసలు ఖర్చులోది కానే కాదు. మన కాంగ్రెసు వారి దృష్టిలో దానిని 'అభివృద్ధి' అంటారు!!

శ్రీ మొరార్జీ దేశాయ్ ఆర్థికశాఖను స్వీకరించారు. అంటే ఆయన కావలసినంత నిందను మూటగట్టుకోడానికి, భరించడానికి సిద్ధంగా ఉన్నారన్న మాట. మొదట రాష్ట్ర ప్రభుత్వాల ఓవర్ డ్రాఫ్టుల పద్ధతిని అరికట్టడంతో ఆయన వెగటయిపోవడం ఖాయం! శ్రీ మొరార్జీ దేశాయ్‌కి మదామ్ గాంధి మంత్రివర్గంలో ఎంతటి బలం వుంటుందో వూహాతీత మేమీ కాదు. తండ్రిగారి లాగా మదామ్ గాంధి ఆర్థిక పరిస్థితినీ, ఆర్థిక నిబంధనలనూ క్రమశిక్షణలూ వంటి వాటినీ తలకెక్కించుకుని దిగులుగా కూర్చోడం ఆమెకు ఇష్టంలేదు. తండ్రిగారంతటి రాజకీయ పరిజ్ఞానమూ, వారికి లేదు, పెద్దవాళ్ళ తెలివితేటల్ని లక్ష్యపెట్టగలిగే నిబ్బరమూ లేదు! అందుకే ఆమె చెప్పుచేతల్లో ఎవరైతే వుంటారో, ఆమె ఆడింది ఆటగా పాడింది పాటగా గుర్తించే వారెవరైతే వుంటారో, వారినే మంత్రివర్గంలోకి చేర్చుకున్నారు! వర్గంలోని ఏ ఒక్కరికీ ఆర్థిక పరిస్థితి మీద సలహా ఇవ్వతగిన యోగ్యత లేదు. భారత ఆర్థిక క్లిష్ట పరిస్థితిని ఒక కొలిక్కి తీసుకురావడానికి శ్రీ మొరార్జీ దేశాయ్ ప్రయత్నిస్తున్నప్పుడు ఎంత మంది తోటి మంత్రులు సహాయపడతారో, వచ్చే రెండుమూడు వారాల్లో కరతలామలకం అయిపోతుంది.

ధరల స్థిరీకరణ, తదితర సమస్యలు, కేంద్రము-రాష్ట్ర బంధుత్వాల మధ్య ఆధారపడి వుంటుందన్న విషయం సత్యం. ఇందులో ఏ ప్రక్క నుంచయినా సహాయ సహకారాలు లభించనప్పుడు పరిస్థితి మరింత అన్యాయంగా తయారవుతుంది. ఉదాహరణకు, ఎన్నికలకు ముందు రాష్ట్ర ప్రభుత్వాలు ప్రజలకు ఎన్నో ఎరలు చూపించి తిరిగి రాజ్యం చేస్తున్నాయి. వాటి పర్యవసానం ఎలా వుంటుంది? జీతాలు పెంచారు. భూమిశిస్తు తీసివేశారు! మరి పిల్లకాలువ లాంటి ఆదాయానికి, మహా సముద్రం లాంటి ఖర్చుకి వంతెన నిర్మించడం ఎలా సాధ్యమవుతుంది? ఇవన్నీ యక్ష ప్రశ్నలు! ధరలు పెంచడ మొక్కటే సమాధానంగా కనిపిస్తూ వుంది!

ఆర్థిక పరిస్థితి బాగుపడుతుందని ఇంకా ఉపన్యాసాలు దంచుతూనే వున్నారు. ఎలా బాగుపడుతుంది, అని ఎదురు ప్రశ్న వేయకుండా వుంటే, ఆ వుపన్యాసం ఎన్ని గంటలయినా కొనసాగుతుంది. మరో విషయం మరచిపోకూడదు. మదామ్ గాంధి వేషం వుంది చూశారూ, వారేమీ తెలివి తక్కువ వారనుకోకండి. జీతాలు సరిపోవడం లేదని రేపో ఎల్లుండో ఒక నివేదికను సమర్పించడానికి వెనుదీయరు! ఆర్థిక పరిస్థితిని చక్కబరచడానికి, దాని అభివృద్ధికి దోహదం చేయడానికి మంత్రులందరికీ శక్తి కావద్దా మరి? వారలా అడిగినా తప్పులేదు! ఇప్పటి ప్రభుత్వరంగాన్ని అవలోకించి చూసినట్లయితే పూర్తిగా ఆర్థిక పరిస్థితి తత్వాన్నే ధ్వంసం చేసేట్టుగా ఉంది.

మన భారతదేశం ఇప్పటికే తల మున్కలుగా విడరాని సమస్యలతో సతమతమవుతూ వుంది. ఇకముందు మరింత ఘోరమైన క్లిష్టపరిస్థితి ఎదుర్కొంటుందన్న విషయం యథార్థం. ఒకటి రెండు మాసాల్లో శ్రీ మొరార్జీ దేశాయ్ తీసుకునే చర్యను, మదామ్ గాంధి వేషం యొక్క ప్రతి చర్యను, సహకార సానుభూతుల్ని మనం కళ్ళారా చూస్తాం! భవిష్యత్ గురించి ఇప్పుడు మనకు కనిపిస్తున్న దృశ్యం మబ్బుమబ్బుగా వుంది. కాని, అది కళంకమయిందిగా మనకు తర్వాత్తర్వాత బోధపడుతుంది!

## లోకం పోకడ

(బొంబాయి ప్రదేశ్ కాంగ్రెసు కమిటీ)... చివరికి (శ్రీ నరవాణే బదులు) శ్రీ రామారావు ఆదిక్— మహారాష్ట్ర స్టేట్ కవున్సిల్ అధ్యక్షుడ్ని— (ఈశాన్య బొంబాయి) ఉపఎన్నికకి నిలబెట్టవచ్చు.

—పేట్రియాట్ (25-3-67

* * *

ఈ పెద్దమనిషి (కేంద్రమంత్రి డాక్టర్ ఎస్. చంద్రశేఖర్) రెండు నెలలముందు 'వరల్డ్ న్యూస్' అనే అమెరికన్ పత్రికకి ఇంటర్వ్యూ ఇచ్చినప్పుడు భారతీయులు గొడ్డు మాంసం తినవచ్చున్నారు. ఇంత జ్ఞానం లేకుండా, ఇతరులకి కోపం కలిగించేటు వంటి వ్యక్తి భారత ప్రభుత్వంలో మంత్రిగా ఉండ తగడు.

—ఆర్గనయిజర్ (26-3 67)

* * *

ఫిబ్రవరి 10 వ తేదీన ఒక ఎన్నిక సమావేశంలో మాట్లాడుతూ శ్రీ చవన్, భువనేశ్వర్‌లో ప్రధానమంత్రిమీద రాయివేసింది ఎస్. ఎస్. పి. మనిషే అయివుండ వచ్చునని సూచించారు. సమావేశం చివర ఒక వనితలేచి ఆయన సూచన నిజంకాదని సవాలు చేసింది. శ్రీ చవన్‌కి కోపం వచ్చింది. "రాయికి లేబిల్ కట్టి ఉండటం నేను చూడలేదు!"

'నవ్' పత్రికలో డి. జి. సతార్కర్.

* * *

శ్రీ పతి చంద్రశేఖర్‌లో 'కుటుంబనియంత్రణ'కి ఒక మిత్రుడు లభించటం జరిగింది. 'ప్రజా శాస్త్రం'లో ప్రపంచ ఖ్యాతిపొందిన ఈయన కొత్త ఆరోగ్యశాఖామంత్రిఅయ్యారు. ఈయనకి ముందు ఈ శాఖ నిర్వహిస్తూ వచ్చిన సుశీలానాయర్ ఎప్పుడూ నవ్వుముఖంతో కనిపించే ఒక అవివాహిత. తిరోగమనవాది అన తగిన ఈమె కుటుంబ నియంత్రణ ప్రణాళికలపట్ల అంత శ్రద్ధ ఎప్పుడూ చూపించ లేదు.

—'టైమ్స్' పత్రిక (24-3-67)










అదిపూర్తయింది. ఎవడైనా అంతకంటే చావునే రుకుం డనుకున్నాడు బాండ్. మళ్లీ ఆడ్‌జాబ్ తులు.......

'నిమిషానికి ఒక అంగుళం చొప్పున రంపం నీ శరీరాన్ని సమీపిస్తున్నది మిస్టర్ బాండ్.'

'చావు! చావు........'










పావురం రెక్కలు, స్వర్గంలో దేవగానాలు స్వర్లోకన్నిగురించి యింకేమేమి వూహించుకోవలో ంచుకున్నాడు బాండ్.....

'కెప్టెన్ మాట్లాడుతున్నాను. మనం కిందికి దిగబోతున్నాం'

'ఎవరది— సెయింట్ పీటరా?'

'వచ్చేది ముత్యాలద్వారం అనుకుంటా'










తను మెల్లిగా వూగుతున్నట్లు బాండ్ గ్రహించాడు.

'జాగ్రత్తబ్బాయ్'

'ఎక్కడున్నాను నేను?'

'చూశావా, శామ్ డాక్టర్‌ని పిలు—ఇతనికి తెలివొచ్చింది'

'గాభరాపడక మిస్టర్. బాగానే ఉన్నావ్. ఇది న్యూయార్క్‌లోని అయిడిల్‌వైల్డ్. నువ్విప్పుడు అమెరికలో ఉన్నావ్. ఇంకేం భయంలేదు. తెలిసిందా?'










కొన్ని గంటల తర్వాత బాండ్ తానొక హాస్పి ల్ వార్డ్‌లాంటి దాన్లో ఉన్నట్లు తెలుసుకున్నాడు...
'చూడ్డానికదరూ బాగానే ఉన్నారుకదూ.'

'మాకేం రోగంలేదు. మమ్మల్ని ఎత్తుకొచ్చారు.'
'చూశారూ! నరాలు స్వాధీనం తప్పాయి. ఇద్దరికీ ఈమధ్య ఎక్కువ పనిపెట్టాను. కొన్ని రోజుల నుంచీ ఇలాగే ఉంది.'

'బహుశ ఇన్‌ట్రావెల్ సోడియం పొడుద్దామా?'
'మీరు బాగా చెప్పారు మిస్టర్ గోల్డ్‌ఫింగర్. అతనికి విశ్రాంతి అవసరం!'










బాండ్‌కి మెలకువ వచ్చేసరికి తానొక చిన్నగదిలో న్నాడు. తానిప్పుడు అమెరికాలో ఉన్నట్లు అతనికి జ్ఞాపకం వచ్చింది.....
'ఆడ్ జాబ్ నాకు బోలెడు తిండి కావాలి. త్వరగా.....'

'బోర్బాన్ ఒక సీసా, సోడా, ఐస్, సిగరెట్లు తీసుకురా! నేను గోల్డ్‌ఫింగర్‌ని చూడాలనుకుంటున్నానని అతనితో చెప్పు—త్వరగా!'

'ఎందుకో గోల్డ్‌ఫింగర్ నన్ను చంపదల్చుకోలేదన్నమాట. మంచిది! నేను నా షరతులమీదనే బతుకుతాను.....'










గోల్డ్‌ఫింగర్ ఒక్కడే లోపలికొచ్చేసరికి బాండ్ తినటం పూర్తి చేశాడు...
'గుడ్‌మార్నింగ్ మిస్టర్ బాండ్ చావటంకన్నా ఇక్కడ ఉండటమే బావుందికదూ!'

'ఇప్పుడు నువ్వు మామూలు మనిషివయ్యావు కబట్టి నిన్నొకటి అడుగుతాను. నాకుసరైన సమాధానం కావాలి. కానీ ఒక సంగతి గుర్తుంచుకో....!'

'నన్నెదిరించడానికి ప్రయత్నించకు. దీనితో కాల్చి పారేస్తాను. నా గురి మంచిది. ఎప్పుడూ తప్పదు.'
'సీసాతో నా గురి అంత బాగుండదులే గోల్డ్‌ఫింగర్! కానీ చెప్పు....' (ఇంకా వుంది)



"నాన్నా! అమ్మ చూడు మనం దీపాలు పెట్టకూడదంటోంది. ఇవ్వాళ" అన్నాడు. ఆరేళ్ల రవి వీధరుగు మీద కూర్చొన్న తండ్రి రాజశేఖరంతో, దీపాలు వరసతో పెడుతున్న ఎదురింటి పిల్లల సందడి చూచి.

"అవున్రా! తాతయ్య పోయారుగా. అందుకని ఈఏడాది మనం పండగ చేసికోకూడదు. నువ్వు వాళ్ల యింటికి వెళ్లి కాల్చుకో. నే చెప్తా" అని బుజ్జగించి పంపాడు రవిని. అన్నిళ్లూ దీపాలతో, పిల్లల కేరింతలతో కళకళ్లాడుతూ వుంటే దీపాలులేక బోసిపోయిన తన యింటి అరుగుమీదకూర్చున్న రాజశేఖరానికి తన తండ్రి జగన్నాధం చనిపోయిన రోజు గుర్తుకు వచ్చింది.

"అవును! తనకి కళ్లకు కట్టినట్లుంది. ఆరోజు ప్రొద్దుకూకిన తర్వాత ఆరుబయట పడకకుర్చీలో కూర్చొని ఏదో ఆలోచిస్తూ వుంటే ఆ సాయంత్రం పొలంలో విడవిన గిత్తలకు గడ్డి వేయడం మర్చిపోయానని గుర్తుకు వచ్చింది. పాలేరు యింటికి వెళ్ళి పదకొండు గంటలకి గాని తిరిగి పొలంలో పడుకొందికి వెళ్లడు. పైగా మర్నాడు, కౌనులో సంతకి తోలుకెళ్ళాలి. వాడు పొరబాటున గడ్డి వేయటం మర్చిపోతాడేమోనని తానే బయలుదేరేడు. అలా మునసబుగారింటి మీదుగా వెళ్తుంటే అక్కడ అందరితో బాతాఖానీ కొడుతున్న మునసబు పిలిచి "ఏం! శేఖరం బాబూ, మళ్లీ పొలం కేటి" అన్నాడు "అవునండి. చిన్నపని వుంటే" అన్నాడతను "అవును కాని మీ నాన్నగారు సుబ్బన్న మీద ఆ పల్లంలో పొలంగట్టు గురించి దావా వేసేట్ట నీకు తెలుసా" అన్నాడు. "ఆరికెలా తెలుస్తాది. ఈరికి ఆరికి మాటామంతీ లేవుగుంద" అన్నాడు పెద్ద రైతు వీరన్న.

"ఏమిటో! ఈ వయస్సులో కృష్ణా, రామా అనుకోకుండా ఇంకా ఈ జగడాలెందుకో" అన్నారు మునసబు.

"అసలు సంగతి అదికాదు బావా. క్రిందటేడు సుబ్బన్న పొలంకి నీరు పెట్టడంలో అదివి కాదని ముందరి నీళ్లు పెట్టుకొన్నాడు దానికి ప్రతీకారం యిది" అన్నాడు. కరణం చుట్ట పొగవదులుస్తూ. "ఏమాట కామాటే చెప్పుకోవాలి. పట్టుదలంటే ఆరిది. తన మాట కాదని సుశీలమ్మ గార్ని చేసుకొన్నాడని పదేళ్లనించి కన్నకొడుకయిన ఈరితో

ఒక్కసారైనాయినా మాట్లాడారా. అసలికి మనవడు పుట్టినప్పుడయినా చూడటానికయినా ఈ ఇంటికి రాలేదు కదా. పంచాయితీ ఎన్నికల్లో రాములుగాడి చేతిలో ఓడిపోయిన తర్వాత వాడిని ఊరినించి గెంటించే దాకా నిద్రపోయాడా. పగ అంటే అలా వుండాలి. తాచుపగ'' అన్నాడు రాములుగాడి చేతిలో—ఒకసారి చావుదెబ్బలు తిన్న కిళ్ళీకొట్టు సుబ్బులు.

''ఆ! ఏం పగ లెద్దూ. దేనికైనా పెట్టి పెడుతూ ఉండాలి. అయినా తన మాత్రం తక్కువ తిన్నాడా. అయన్ని కాని అడక్కుండా సుశీలమ్మ గారికి వచ్చినవాటా అయిదెకరాలు యిప్పుడు పది చేసేడు కదా. నిజంగా ఆ తండ్రికి తగ్గ కొడుకు ఈయన'' అన్నాడు మునసబు నవ్వుతూ.

''మరివే వస్తానండి'' అంటూ తను పొలంకేసి దారితీసాడు.

అప్పటికే రాత్రి ఎనిమిది దాటింది. బాణాకర్ర రెండు భుజాల మీద అన్చి రెండుచేతులు దాని మీద జాపి చేనిగట్టు వెంబడి నడుస్తున్నాడు తను. చక్కటి వెన్నెల కాంతిలో చుట్టూ పొలాలు మరింత అందంగా కనిపిస్తున్నాయి. ప్రక్క పొదల్లో కీచురాళ్ళ ధ్వని, దూరాన్నించి తీతువు పిట్టల అరుపులు తప్ప యింకేమీ వినిపించడంలేదు. ఇందాక మునసబు అన్న మాటలు గుర్తుకు వచ్చి నవ్వు వచ్చింది. ''నిజమే! ఈ వూళ్ళో తన తండ్రి అంటే అందరికీ హడలు. పరోక్షంలో యింత విమర్శిస్తారు కాని ఆయన ఎదుట వుంటే పిల్లుల్లా ఉంటారు వీళ్ళంతా. ఆరడుగుల ఎత్తు, భారీ శరీరం. తెల్లటి పండిపోయిన జుత్తు. మెడలో రుద్రాక్షమాల, చేతులకు బంగారు కంకణాలు నుదుటిని విభూది రేఖల మీద గంధం బొట్టు. తెల్లటి పంచె కట్టుతో కిర్రు చెప్పుల వేసుకొని కర్ర చేత్తో పట్టుకొని ఆయన నడుస్తూ వుంటే ఎవరినైనా శపించగల మహిమ వున్న రాజర్షిలా కనపడతాడు. ఆయన బ్రాహ్మడయినా ఆయన రోజుల్లో ఆయనతో కర్రసాము చేసేవాడు ఆ ప్రక్క పేరుగాళ్ళల్లో ఎవరూ వుండేవారు కాదట. ఆయనమాట కాదన్న వాళ్ళెవరు ఆ వూళ్ళో బ్రతికేలేదు. ఆయనకి పట్టుదల, పగ అలాంటివి. తనకి బాగా గుర్తు. తన తల్లి చనిపోయినప్పుడు ''మహాలక్ష్మి పోయిందమ్మా'' అని చిన్నాపెద్దా అంతా కంట తడిపెడ్తే, ఆయన కళ్ళలో ఒక్క కారుమేఘం కూడ క్రమ్మలేదు. ఏభయి పడిలో పడ్డా కూడ ఆయనింకా పొలంపనులు స్వయంగా చూచుకుంటాడు. ప్రథమ తీర్థానికి ఆ వూరి ప్రభ మోయటానికి ఒకవైపు యిప్పటికీ ఆయన ఉండాల్సిందే. ఆయన్ని ఎదిరించి తను సుశీలని చేసికొన్నాడు. అంతే! ఆ రోజు నుంచి ఈరోజు వరకు తనని పలకరించి ఎరుగడు. తన మాట కాదన్న వాళ్ళని ఆయన సహించడు. ''ఏమిటి ఈ రోజు నాన్న గురించి యింత ఆలోచిస్తున్నాను'' అనుకొంటూ. తను నడుస్తున్నాడు. ఇంతలో తన కెదురుగా ఎవరో వ్యక్తి తన కెదురుగా వస్తున్నట్లు చూశాడు. తన ప్రక్క పొలం సుబ్బన్నేమో అనుకొన్నాడు. కాని ఆ వ్యక్తి దగ్గరకు వచ్చేసరికి తన తండ్రిగా గుర్తించాడు. తను కర్ర చేతిలోకి తీసికొని తండ్రికి దారి యిచ్చాడు. ఆయన మొఖం తనని చూసేసరికి కాఠిన్యం వహించింది. కళ్ళు కొద్దిగా ఎర్రపడ్డాయి. తనని చూడటం యిష్టం లేనట్లు మొహం తిప్పి తనను దాటి వెళ్తున్నాడు ఆయన. అలా వెళ్తున్న తండ్రి కేసి చూస్తున్నాడు తను అనాలోచితంగా. అకస్మాత్తుగా ఉలిక్కి పడ్డాడు తను. తన తండ్రి వెళ్ళే దారిలో ఎదురుగా ఆరడుగుల దూరంలో ఒక త్రాచుపాము పడగ ఎత్తివుంది. తను వచ్చినప్పుడు లేంది ఇప్పుడు ఎలా వచ్చిందా అని ఆశ్చర్యపడ్డాడు తను. ఆయన యింకా ఆ పాముని చూచినట్లు లేదు. ''నాన్నా!'' అని హెచ్చరిద్దామనుకున్నాడు. కాని ఆమాట పెదవి దాకా వచ్చి ఆగిపోయింది. అలా పిలవడం అలవాటు తప్పిపోయింది తన పెదాలకి. ఆయన యింకా ముందడికి పోతున్నాడు ఏదో ఆలోచిస్తూ. తనకి ఏమి చెయ్యడానికి తోచలేదు. కాని మరుక్షణంలో తను కర్రతో నేర్పుగా పాము పడగ మీదకి సూటిగా కొట్టాడు. ఒకే దెబ్బకి పాము చచ్చిపడిపోయింది. ఆయన గబుక్కున, ఆ పాము కేసి తర్వాత తనకేసి చూసాడు. ఆ చూపులో భయంకాని అరదండ కాని ఏమీలేదు. పైగా కోపం వుంది. బహుశా తనవల్ల ఈ లోకంలో వద్ద ప్రాణి తనని రక్షించాడని అభిమానమేమో. ఇంక ఆగకుండా తాను వెళ్ళిపోయాడు. పని ముగించుకొని తిరిగి వస్తుంటే ఆయన యింకా అక్కడే నిలబడి వుండటం చూశాడు తను. మళ్ళీ ఆయనకు కనిపించడం యిష్టంలేక తన ప్రక్కదారి గుండా వచ్చేశాడు తను.

''ఆయన యింకా అక్కడే ఎందుకు నించున్నాడా'' అనే ప్రశ్నకి సమాధానం దొరక్క నిద్రపోయాడు ఆ రాత్రి తను.

ప్రొద్దున్న అయిదు గంటలకి తన యింటి ముందర పెద్దగుంపు చేరింది. ''బాబుగారూ మీ నాన్నగార్ని పాము కరిచింది'' అంటూ అరుగు మీద మంచం మీద ఆయన్ని పడుకోబెట్టారు. ఆయన మొహం బాగానల్లబడి వుంది. కాని కాఠిన్యం మాత్రం వదలలేదు. మంత్రాల చంద్రన్న ఏవో పసరులు రాస్తూ మంత్రాలు చెప్తున్నాడు.

''అసలెలా జరిగింది'' అన్నాడు తను.

''నేను పొలానికి వెళ్తుంటే ఈయన దారిలో గట్టు మీద పడి వున్నారు. ఆయన ప్రక్కన మనకి పొలాల్లో అప్పుడప్పుడు కన్పడే జత త్రాచులు చచ్చిపడి వున్నాయి అండీ'' అన్నాడు సుబ్బన్న. తను ఒక్కసారి చకితుడయ్యాడు.

''అయితే! తాను చంపింది పెళ్ళి ఈ వూళ్ళో చాలమంది చూసిన జత త్రాచులలో ఒకటి అన్నమాట. ఎప్పుడూ ఎవరికి కనబడినా అవి జతగానే కనబడేవి. అవి ఎవరికి అపాయం చెయ్యవని కూడ జనం నమ్మిక. కాని తను మాత్రం ఎప్పుడూ వాటిని చూడలేదు! అప్పుడు మంత్రాల చంద్రన్న తన దగ్గరికివచ్చి'' బాబుగారు నాన్న గారింక బ్రతకరు. ఆ పాములు జాతయినవి. పైగా నాన్నగార్ని కరచి పేరెండు మూడు గంటలయినపుంటుందండి. ఆయన రాబట్టే యింకా వూపిరి పీలుస్తున్నాడు'' అన్నాడు.

తనకి నెమ్మదిగా సంగతి తేటతెల్ల మవుతోంది. ''తను చంపింది ఆపాముల్లో ఒకదాన్నన్నమాట. రాత్రి బహుశా వాటిల్లో ఒకటే వచ్చి వుంటుంది. దాన్ని చంపిన తర్వాత తప్పకుండా రెండోది దాన్ని వెతు

# ఆరని పగ

క్కొంటూ వచ్చి వుంటుంది.

ఆన తండ్రికి అన్నివిషయాలు తెలుసును కాబట్టి ఆ రెండో పాము వచ్చేవరకు అక్కడే వుండివుంటాడు దాన్ని చంపడానికి. నిజంగా చంపాడు కూడాను. కాని అలా జరిగే లోపులో ఆపాము ఆయన్ని కరిచి వుంటుంది. అబ్బ, ఎప్పుడు తలచుకొన్నా కన్నడే ఆయనికి ఎంత పుత్రవాత్సల్యం. లేకపోతే ఆ పాము తన మీద పగ తీర్చుకొనేది" అలా అనుకుంటూంటే తనకప్పుడు కళ్ళు చెమర్చాయి. ఇంతలో ఆయన కళ్ళు తెరిచాడు. తనని దగ్గరగా పిలిచాడు "రాజా! నువ్వు నన్ను రక్షించావు నిన్నరాత్రి. అందువల్ల నీ ప్రాణం రక్షించాను. ఎవ్వరూ ఎవ్వరికీ ఋణపడి వుండక్కర్లేదు. కాని ఒక్కటి మాత్రం గుర్తుంచుకో. ఆ పరిస్థితుల్లో నీ బదులు ఇంకో వ్యక్తి వున్నా అలాగే చేసేవాణ్ణి. అంతేగాని నువ్వు నా కొడుకువని మాత్రంకాదు." అవే ఆయన ఆఖరి మాటలు.

తండ్రి చితి మీద మంటలు రేగుతుంటే తను ఆలోచించాడు. జీవిత కాలంలో అంతా పట్టుదల తోడి, పగలతోడి సతమతమయిన ఆ దేహం యిప్పుడే బూడిద అయిపోతోంది. ఏమిటి ఆయన సాధించింది? లోకం దృష్టిలో ఆయన పాషాణ హృదయుడు. కన్నకొడుకునే క్షమించలేకపోయిన నిర్దాక్షిణ్యుడు. అమ్మవారి తీర్థంలో తన యింటి ముందు ఎక్కువ సేపు ఆడలేదని అసలు ఆ ఏడాది అమ్మవారికేమీ అర్పించని నాస్తికుడు. ఆఖరికి చనిపోయేటప్పుడు కూడ కన్నకొడుకుని కొడుకుగా గుర్తించని కఠినాత్ముడు పట్టుదల, పగే ఆయన జీవిత లక్ష్యాలుగా పెట్టుకొని, ఆయన చనిపోయిన తర్వాత మిగిల్చిన స్మృతి చిహ్నాలేమున్నాయి? అంతే కొందరి వ్యక్తుల క్షుద్ర జీవితా లంతేనేమో."

రాజశేఖరం ఆలోచనలకి అడ్డుదిండి పిల్లాడు వెలిగించగానే వెలిగిన చిచ్చుబుడ్డి చప్పుడు అంతరాయం కలిగించింది. ఆ పగిలిన చిచ్చుబుడ్డి మంటలను విరజిమ్ముతోంది. వెంటనే ఆ పిల్లవాడు మరొకటి వెలిగించడు. ఈసారి మంచి పువ్వులలో చాలసేపు వెలిగింది. అది వెలిగినంత వరకు పిన్నలు పెద్దలూ ఆనందంగా దానికేసి చూసారు.

# అందలి సొగసు గలిగించే-పదార్థం జి11 హెక్సాక్లొరొఫిన్ మరియు దాని తాజా సువాసనయేగాకుండా సింథాల్‌కు ఎంతో ప్రత్యేకతను సమకూర్చింది ఏది ?



# తక్కువ ఖర్చు!

సింథాల్ చాలా కాలం నిలవుంటుంది. ఎందుకనగా అది విశిష్టంగా నిర్మించ బడింది. అందలి మితమైన తేమ అది నాని కరిగిపోకుండా విరోధిస్తుంది.




సింథాల్ దుర్గంధ నిరోధకమైన దివ్యమగు సబ్బు. జి-11 (హెక్సాక్లోరొఫీన్) మురికి మరియు చెమట వల్ల ఉద్భవించే క్రిములను నిర్మూలిస్తుంది. శరీర దుర్గంధమును తొలగిస్తుంది.




మీరు రూఢియైన నమ్మికతో-రోజల్లా హాయిగొలిపే పరిశుభ్రంగా నుండుటకు జి-11 (హెక్సాక్లోరొఫీన్) గల సింథాల్ సబ్బును మరియు సింథాల్ టాయిలెట్ పౌడర్‌ను వాడండి.

జి-11, ఎల్. గివాడా ఎట్. సీ. ఎస్. ఎ. వారి ట్రేడ్ మార్కు.

# వేలూరి శివరామశాస్త్రిగారు



శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారి గుంటూరు శతావధానం మాట నా చిన్నతనంలో ప్రతి పండితుని నోట వినిపించేది. పట్టుమని పందొమ్మిది సంవత్సరాలైనా నిండని శివరామ శాస్త్రిగారు తమ గురు ప్రతిద్వంద్వులయిన శ్రీ కొప్పరపు సోదరకవులను సాహిత్య సమరాంగణంలో మార్కొని చెప్పిన

"అనిమిత్తంబుగ గాలు ద్రవ్విన త్వదీ
యాహంత నాపుచ్చెదం
వృం ఎ నీరస విర్గుణాశుకవనం
బుం జెప్పి విన్గల్వ నెం
చిన యస్మద్గురు వర్యులన్ సుకవితా
శ్రీ ధుర్యులన్ మానిపిం
చి నినున్ గెల్వగ వచ్చిన నిదె సభం
జేయింతువో! వత్సవో!''

అనే పద్యాన్ని మాకు ఆదర్శంగా చెప్పేవారు; మా పై తరగతి విద్యార్థులు; మేమూ విస్తుపోయి వినేవారం. ఆసమరంలో అక్షతగాత్రులై గెలుపు పొందిన శివరామశాస్త్రిగారిని తిరుపతి కవులు—

"బాల్యోద్రేకమున్నై నెదిర్చితివి శో
ప్రంపుంగవిన్ గ్రంథసా
కల్యంబుం బొనరింతొ లేదొ యని వీ
కై కొంకు నన్మన్మన
శ్శల్యం బిప్పటి కూడదీతిసితివి త
త్సా! సత్సభా శోభివై
కళ్యాణంబుల బొందుమయ్య యిక వీ
కన్ శిష్య చూడామణీ!''

అని దీవించారట. తర్వాత శివరామశాస్త్రిగారు తెనాలి, బెజవాడ, కొవ్వూరు, చిట్రాయి మొదలయిన పెక్కు తావులలో అవధానాలు చేసి అలాటి కీర్తినే సంపాదించారు.

గురువుల గౌరవం నిలబెట్టిన శిష్యశిఖామణులైన శివరామశాస్త్రిగారు అప్పటికే చెప్పుకోదగిన వ్యుత్పన్నత గలవారు, ముక్తాలత అనే కావ్యం, ఉపగుప్తకావ్యం, బిడాలోపాఖ్యానం అనే పద్యకథ, కృతక స్తోత్రం అనే ఖండకావ్యం వారి కమ్మని కైవారానికి అప్పటికే సాక్షీభూతాలు.

వారి జననసంస్కారం అటువంటిది. కృష్ణాజిల్లా చిరివాడలో వారు 1892లో జన్మించారు. చదువు, చెల్వము గల వంశం. తండ్రిగారు వేంకటేశ్వరావధానులు, ఘనాంతస్వాధ్యాయులు. తల్లిగారు శ్రీ విశాలాక్షిగారు, తమ కుమారునికి విశాల దృక్పథాన్ని ప్రసాదించిన వారు. ఇక మేనమామగారు దోర్బల శోభనాద్రి శాస్త్రిగారు, మహా పండితులు. జననంతోనే కలిగిన ఈ సంస్కృతిలాభం శివరామశాస్త్రిగారి మేధకు, ఏకసంథ గ్రాహితకు, పట్టుదలకు మెరుగులు పెట్టింది.

పెద్దల పోరుతో వారు ఇంగ్లీషు చదువు మిడిల్ స్కూలు దాటించినా, తర్వాత మానివేసి ఆకిరిపల్లికి వెళ్లి సంస్కృతం చదువ సాగారు. తర్వాత ఇంజరంలో కాపురం పెట్టి శ్రీజయంతి భగీరథ శాస్త్రిగారివద్ద వ్యాకరణం ప్రారంభించి మహాభాష్య శాంతి చేసుకున్నారు.

తర్వాత చిరివాడకు తిరిగివచ్చి వ్యాకరణం పాఠం చెబుతూ, త్రైయంతాలను అవలోడిస్తూ, వివిధ దర్శనాలు అధ్యయనం చేస్తూ, "ఒక్క భాషగాదు తక్కిన భాషలన్ని గూడ నేర్వుమయ్య యాంధ్ర!'' అని ప్రబోధించిన వారు గనుక తాము పెక్కు దేశీయ భాషలు , పారశీకాది వివిధ విదేశ భాషలు నేర్చారు. సంగీతం కూడా నేర్చారు. వారి సంగీతాభ్యాసానికి ఒక చిన్న కథ వుంది. ఆకిరిపల్లిలో వున్నప్పుడు, శ్రీ గరికిపాటి జోగయ్యశాస్త్రిగారి కర్ణపేయమైన పురాణ కథనం విని వారికి సంగీతంపై అభిరుచి కలిగింది. కాని గొంతు పెగలదు. ఆ ఆవేదనతో

"గాతే గురుః గురు సుతశ్చ
సుతా చ గాతే
నాహం ప్రభుః యదపి
కంఠ విలుంఠనేన,
హా! సామగానగురు మే
శృణు కంఠనాథః
త్వద్వస్తు సీమని భవిష్యతి
వేణు నశః''

అని భగవానుని ప్రార్థించారట. తర్వాతదానిని ఎలాగో సాధించారు. అనగననగ రాగమతిశయిల్లుచు నుండు— కదా!

పాశ్చాత్య సంప్రదాయవాసనలో వారు యతిప్రాసలు వదలి ఆది సభా పర్వాలు తెలిగించారు. షేక్స్పియర్‌ను అనుకరించి పది నాటికలు రచించి, బుక్కులు పెక్కు ఆంధ్రీకరించి, మణిమేఖల అనే ఏడాశ్వాసాల కావ్యం రచించి, రసగంగాధర, ధ్వన్యాలోక పద్మపురాణాదులు అనువదించి పెట్టుకొని ఒక సభకు వెళ్లితే ఆ గ్రంథాలన్నీ వున్న పెట్టెను ఎవరో చోరులు తస్కరించారు. అటు తర్వాత వారు ఎంతో శ్రమపడి సేకరించిన గ్రంథాలయం,

"క్షయ వత్సరమున నతవ
భయ మగువైశాఖకృష్ణ పక్షంబున సూ
రయ దినమునన్ ద్వితీయో
దయమున చిరివాడ యెల్ల దగ్ధంబో

యినప్పుడు కాలిపోయింది. దానితో వారు అనువదించిన దర్శనాలు, యోగవాశిష్ఠం మొదలయిన ఉద్గ్రంథాలు కాలిపోయాయి. దానికి వారి గుండె కూడా మండింది.

"కాల్చితి వెల్ల సర్వము

గాల్చితి పాత్రము లూచముట్టగా,
గాల్చితి వెల్లయున్ ధనము
కాల్చితి వెల్లయు ధాన్యరాసులన్
గల్చితి పుష్ప వెల్లయును
గాల్చిన గాల్చితికాక గ్రంథముల్
కాల్చిన నీకు నో జ్వలన!
కడుపది నిండెనో? కాలు నిండెనో!"

అని వారు వాపోయారు. అష్టావధాన శతావధానాల పాము గరిడీల ప్రయోజనం అంతంతేనని గ్రహించిన శివరామ శాస్త్రిగారి మనస్సును ఈ అగ్ని ప్రమాదం కొంతమార్చింది. స్వాతంత్ర్య సమరాంగణ సూత్రధారి అయిన గాంధిజీ ప్రభావం మరింత మార్చివేసింది. దానితో వారి దృక్పథం మరొక మార్గంలో ప్రసరించింది. చిరివాడలోని తమ తోటలో ఆశ్రమ తుల్యమైన నివాసంలో ఏకాంతవాసంచేస్తూ, అయ్యయునా ధ్యానన కర్మలు జరిపారు. ఆ సమయంలో వారు చెప్పిన ఈ పద్యం వారి ఆకులతకు, దానికి ఆలవాలమయిన మనస్తత్వానికి నిదర్శనం:

"ఏ యొకరుండు లేని యొక
యేటి సమీప తలంబునం దిర
ణ్యాయ తనంబునందును ది
టాక తటంబునయందు గోటయం
బాధుత శైల శృంగమున
యందు జనించు మహోపనీజ మూ
ఖా యెల యొండు వాసనము
నొందును దప్పక నాకు గావలెన్."

ఈ ఏకాంతవాసంలో వారు వివిధ శాస్త్రాలను ఆలోడించారు. ఖగోళశాస్త్రంమొదలు కర్మమీమాంసవరకు ఆధునిక దృక్పథంతో తరచారు. రవీంద్రుని 'కథా'—ను కథలు—గాథలు అని, శరచ్చంద్రుని నవలలు—రముని బుద్ధిమంతనం, సర్వేసుపేలునామా, తీరని కోరికలు, బాపనపిల్ల— అని గాంధిజీ ఆత్మకథను అనువదించారు. శతాధికంగా కథలు వ్రాశారు. వాటిలో పీతల్ కా దర్వాజా, చిక్కటితప్పు, క్షమాపణ మొదలయినవి గొప్పవస్తువులు. వారి సాహిత్య విమర్శ గ్రంథాలు సోముడు, తాలు కుట్మనము, సభ్యత, విషయ దృష్టి గలవి. మాధవసర్మ విషాదాంతనాటకం, ఏకావళిఖండ కావ్యసంపుటి. కథాషట్కం, కథాసప్తకం— రెండు కథాసంపుటాలు.

శాస్త్రిగారు శాస్త్రవిషయాలను— ముఖ్యంగా అరవిందుని అతిమానసమతాన్ని వివరిస్తూ, ఇటీవల భారతిలో వ్రాసిన "ఋతచిత్" వ్యాసంతోపాటు వ్రాసి వ్యాసాలు కొన్ని వందలుంటాయి. వాటిని సంపుటాలుగా ప్రచురిస్తే, ముందుతరాలవారికి విజ్ఞానకోశాలవుతాయి.

శాస్త్రిగారి శైలిలాగే జీవితం, రూపం కూడా సరళ సుందరమైనవి. వారు త్రికరణాలతోను, గాంధిజీ అనుయాయులు. జాతీయవాదిగానే జీవించి జాతీయవాదిగానే పరమపదించారు. కనుకనే తుదివరకు సచ్చింతే వారిని అనుగమించింది. పరమపదించడానికి వెనుకటిరాత్రి—(1967 మార్చి 16వ తేదీ రాత్రి) భగవద్గీతను ఇష్టుల గోష్ఠిలో వ్యాఖ్యానించారు. మరునాటి ఉదయం [illegible] వుల బాశారు.

శ్రీ శాస్త్రిగారి భౌతికకాయంలాగే కీర్తికాయమూ అనవద్యావదాతమైనది. దానికి సాహిత్యరంగంలోగాని, వ్యావహారికరంగంలోగాని నీలిరేకలు ఎన్నిటికీనూ పోకవు.

—రామచంద్ర ●

**ఇంతవరకు కథ**

రామదాసును హత్యచేసి ఆయన దాచుకొన్న దంతా ఎవరో దోచుకు పోయారు. అంతక్రితమే సత్యమూర్తితో తన కథ కొంత చెప్పారు రామదాసు ప్రకాశం తన షుగర్ ఫ్యాక్టరీలో సత్యమూర్తి ఉద్యోగం ఇచ్చాడు. ఆ చుట్టుప్రక్కల ప్రకాశానికి చాల పరపతి వుంది. అతనికి దామోదరం నమ్మినబంటు. సత్యమూర్తి భానుమతి పరస్పరం ఆకర్షించుకున్నారు. భంగపడిన బెనర్జీ, దామోదరం కొడుకు గోపాలన్ ఇద్దరూ భానుమతి మీద ఎక్కువ చూపిస్తున్నారు. ప్రకాశం ప్రమాదానికి గురి అయ్యాడు. ఉమ అతనికి సేవ చేస్తుంది. కళ్యాణికి తనకు ఉన్న బాంధవ్యాన్ని ఉమకు తెలియపరిచాడు ప్రకాశం!




## 23

భానుమతి పరిస్థితుల నెంత ధైర్యంతో ఎదుర్కొందామనుకున్నా, అకస్మాత్తుగా, ఎదురు చూడని ప్రమాదంలో, చిక్కుకోవడం వలన ఆమెకు, ఏమవుతుందోనని అధైర్యం పట్టుకుంది, భవిష్యత్తు గురించి. ఆమె ఇప్పుడు జగ్గారావు గారింట్లో, ఒక గదిలో బంధించబడివుంది. ఆగదిలో ఆమెకు కావలసినవన్నీ వున్నాయి. కాని ఆమె ఆ గది బయటకు వెళ్ళడానికి వీలులేదు. బయట తాళంవేసి వుంది. రాత్రి పదిగంటలకు, ఆమెకు గోపాలన్‌తో వివాహం జరుగుతుందని తెలిసింది. అప్పటికి సమయం, సాయంకాలం ఆరుగంటలైంది.

ఒకగంట క్రితమే తను, ఒక స్నేహితురాలింటికి వెళ్ళి వస్తానని ఇంట్లో చెప్పి బయల్దేరింది. ఇల్లు వదిలి కొద్దిదూరం రాగానే, తన కోసం వస్తున్న జగ్గారావుగారి కారు ఎదురైంది. "మాలతమ్మగారు వెంటనే ఓ సారి రమ్మన్నారని." డ్రైవరు కారాపి చెప్పగానే, వెంటనే వెళ్ళి వచ్చేద్దామని, కారెక్కింది. జగ్గారావుగారి ఇంటి వద్ద కారాగగానే, తను దిగి లోపలికి వెళ్ళింది. హాలులో ఎవరూ ఎదురుపడక పోవడంతో మనసు అదోలాగయింది. ఆ ప్రక్కనే వున్న మాలతి గదిలోకి వెళ్ళింది. తను లోపలికి వెళ్ళగానే, గది తలుపులు మూసిన శబ్దమైంది. బయట ఎవరో గొళ్ళెం పెట్టారు. తను వెంటనే పరుగెత్తి తలుపు బాదింది. అరిచింది, 'మాలతీ' 'మాలతీ!' అని. కాని లాభం లేకపోయింది. తను, ఆ గదిలో బంధింపబడింది. ఇక అరచి అరచి అలసిపోవడమేనని గ్రహించింది. కిటికీలో నుండి ఎవరో ఒక చిన్న చీటీ విసిరేశారు. అందులో "రాత్రి పదిగంటలకు గోపాలన్‌తో నీ వివాహం జరుగుతుంది." అని వుంది.

తననందు కోసం బంధించారని గ్రహించిన భానుమతి, కొద్దిసేపు తలుపులను కొట్టి, ఇక వృధా శ్రమ అని అక్కడొక కుర్చీ మీద కూర్చుని ఆలోచించసాగింది. ముందు ఆమెకు దుఃఖం ఆగక ఏడుపొచ్చింది. పది నిముషాలు ఏడ్చాక, నీరసం వచ్చి, అలా చాలాసేపు నిశ్చలంగా వుండిపోయింది. ఆమె ఎంత ఆలోచించినా, బుర్ర పని చెయ్యడం మానేసింది. తను ఈ స్థితిలో చిక్కుకున్నట్టు తన వారెవరికీ తెలియదు. ఇటువంటి పని జరుగుతుందేమోనని అనుమానిస్తూనే వున్నప్పటికీ, ఇంత త్వరగా జరుగుతుందనుకోపోవడం వల్ల, అంతా నిర్లక్ష్యంగా వున్నారు.

సత్యమూర్తి తన తనే సార్లు చెప్పాడు జగ్గారావుగారి ఇంటికి వెళ్ళవద్దని. దామోదరం, తను అనంతరావుగారి ఇంటికి వెళ్తూంటే అతని పన్నాగాలక్కడ ఫలించవని, ఈ జగ్గారావుగారి ఇంటికి తన వచ్చేటట్టు చేశాడు. తను కూడా తెలిసే జగ్గారావు గారింటికి వస్తోంది. దామోదరం యొక్క, గోపాలన్ యొక్క నిజస్వరూపాలు తెలుసుకోవాలని, వాళ్ళని కలుసుకోవడం మొదలెట్టింది. వివాహానికి తన సుముఖంగా లేనని పసిగట్టిన దామోదరం వెంటనే బలవంతంగా వివాహం జరిపించేయ తల్చుకున్నాడు. ఇప్పుడు తనకు దిక్కెవ్వరు? ఎలా తను ఈ ప్రమాదంలో నుండి బయటపడగలదు? జగ్గారావుగారికీ సంగతులన్నీ తెలిసే వుంటాయి. ఆయన కూడా దామోదరంతో చేతులు కలిపే వుంటాడు. అందుకనే, ఈ పని ఆయన ఇంట్లో ఏర్పాటయింది.

ఒకవేళ తన పరిస్థితి తన వారెవరికీ తెలియక రాత్రి పెళ్ళి జరిగిపోయిందంటే, తన జీవితమంతా దుఃఖభాజనం కావలసిందే. ఆలోచించిన కొద్దీ తన పరిస్థితి చాలా ప్రమాదంగా వుందనిపించ సాగింది ఆమెకు. ఈ సంగతి తన శ్రేయోభిలాషు లెవ్వరికీ తెలిసే అవకాశం కన్పించటంలేదు. సత్యమూర్తికి తెలిసినా చాలు, తనని ఆపద నుండి కాపాడగలడు. ఆ రోజు సాయంకాలం అతను రామవరం నుండి, తనను కలుసుకోవడానికి రావలసి వుంది. తప్పక వస్తాడు. వచ్చి తను కనిపించకపోగానే, ఖంగారు పడతాడు. అన్నిచోట్లా తన కోసం వెదుకుతాడు. అతని బుర్ర సరిగా పని చేసిందంటే, ఈ దుర్మార్గాన్ని కనిపెట్టగలుగుతాడు. కనిపెట్టి తగిన చర్య తీసుకుంటాడు. ఒకవేళ అతను, మరోవిధంగా ఆలోచించినట్లయితే ఈ విషయం తెలియక పోవచ్చు. అప్పుడు అతను వచ్చి తనను కాపాడే అవకాశంలేదు. అప్పుడేం చెయ్యాలి?

తనను ఈ ఆపద నుండి కాపాడగలిగింది భగవంతు డొక్కడే! ఆయనను ధ్యానిస్తూ చూచోడమే మంచిది. ఏమైనా, అంతగా ప్రమాదం ముంచుకు వస్తే ఆత్మహత్యైనా చేసుకుంటుంది గాని గోపాలన్‌కు లొంగదు. ఆమె అలా విచారిస్తూంటే మరో రెండుగంటల సేపు గడిచింది. గది తలుపు తియ్యబడింది. ఎవరో నలుగురు ఆడవాళ్ళు వచ్చారు. భానుమతికి తలంటి నీళ్ళు పోస్తామనీ, పెళ్ళి కూతుర్ని చేస్తామని అన్నారు. తలుపులు తియ్యగానే బయటికి వెళ్ళిపోవాలని అనుకున్న భానుమతికి గుమ్మం దగ్గర ఇద్దరు రవుడీలు కన్పించారు.

ఒకడు నల్లగా పొడుగ్గా వున్నాడు. మరొకడు చాలా లావుగా వున్నాడు. ఇద్దరూ లుంగీ కట్టుకుని దాని మీద బనీను వేసుకున్నారు. వాళ్ళని చూడగానే భానుమతి గుండె లవిసిపోయాయి. తనుపూర్తి నిర్బంధంలో వుంది. ఇక తను తప్పించుకోవడానికి ఏ ఆశాలేదని తోచేసరికి, ఆమెకు ప్రపంచం గిర్రుని తిరిగినట్లైంది. మోహం తిరిగి పడిపోయింది. ఆడవాళ్ళు ఆమెను పట్టుకున్నారు. వాళ్ళు, తమ పని ప్రారంభించారు.

ఆ ప్రక్కనున్న గదిలోనే వివాహానికి అన్ని ఏర్పాట్లూ జరిగాయి. గది మధ్య పీటలు వేసి వేదిక అమర్చారు. జగ్గారావుగారూ దామోదరం, పెళ్ళికి కావలసినవన్నీ తెచ్చి పెట్టి కూసుకున్నారు అక్కడి సామాన్లు లెక్కపెట్టి. పురోహితుడు సిద్ధంగా వున్నాడు. అతనికి దామోదరం చెప్పవలసిందంతా చెప్పాడు. పెళ్ళి టూకీగా రెండు గంటల్లో అయిపోవాలి. రాత్రే శోభనం కూడా జరిగిపోవాలి. పెళ్ళికూతురు ఏం

హారాం చేసినాసరే, బలవంతంగా తాళి కట్టెయ్యడం జరగాలి. దామోదరం, జగ్గారావు పెళ్ళిపెద్దలు. జగ్గారావు కన్యాదానం చేస్తాడు, గోపాలన్‌కి. గోపాలన్ పెళ్ళికొడుకులా ముస్తాబై కూచున్నాడు.

సుమారు తొమ్మిది గంటలకు ఏడుస్తున్న భానుమతిని తీసుకువచ్చి పెళ్ళిపీటల మీద కూర్చోపెట్టారు. దామోదరం, "విచారించకు భానుమతీ, స్వర్గంలో వున్న మీనాన్నగారి ఆత్మ ఈ పెళ్ళితో శాంతిస్తుంది" అన్నాడు ఆమె వద్దకు వెళ్ళి. "ఆయన నన్ను కోరిన ప్రకారం, ఈ వివాహం జరిపిస్తున్నాను. నువ్వు విచారించక్కరలేదు."

"ఛీ! మీరింత నీచులనుకోలేదు. నన్యాయం చేస్తే మీకేం లాభం? నేను మీకేం అపకారం చేశాను? నన్ను వదిలిపెట్టండి." అని భానుమతి ఏడ్వసాగింది. గట్టిగా, బలవంతంగా, ఆమెను పీటల మీద కూర్చోపెట్టారు, ఆడవాళ్ళు నలుగురూ. వాళ్ళ వెనకాల రౌడీలున్నారు.

పురోహితుడు, దామోదరం సైగ జూసి మంత్రాలు ప్రారంభించాడు. దామోదరం వాచీ చూస్తున్నాడు. ఎంత త్వరగా మాంగల్యధారణ జరుగుతుందా? అని. అరగంట జరిగినా మంత్రాలు జరుగుతూనే వున్నాయి పురోహితుడు ఏవేవో తంతులు చేయిస్తున్నాడు. "త్వరగా మాంగల్యధారణ జరగాలి." అని దామోదరం పురోహితుణ్ణి హెచ్చరించాడు.

బయట తలుపు తట్టిన చప్పుడైంది.

జగ్గారావు దామోదరం వైపు చూశాడు. ఆ చూపులో ఏం చెయ్యమంటావనే? ప్రశ్న వుంది. దామోదరం ఒక్కక్షణం ఆలోచించాడు. బ్రాహ్మడి వైపు చూసి "ముహూర్తానికి ఇంకా ఏమాత్రం ఆలస్యముంది?" అని అడిగాడు.

బయట మళ్ళీ చప్పుడైంది.

"పది నిముషాలు వ్యవధి వుంటుంది బాబూ. మంగళసూత్రాలేవీ?" అని అడిగాడు, పురోహితుడు, వాటి కోసం వెదుకుతూ. అవి కన్పించలేదు.

బయట మళ్ళీ తలుపు ఎవరో బాదగా జగ్గారావుని చూసి, చిరాకుగా తలవూపాడు దామోదరం, వెళ్ళి ఎవరో చూడమన్నట్టు. జగ్గారావు హాలులోకి వెళ్ళాడు, వచ్చినదెవరో చూడడానికి. మంగళ సూత్రాల కోసం అందరూ వెదకసాగారు.

అయిదు నిముషాలు గడిచినా మంగళ సూత్రాలు దొరకలేదు. దామోదరానికి పురోహితుడిపై అనుమానం వేసింది "ఒరేయి షైడీ. ఆ పురోహితుణ్ణి పట్టుకోండిరా. అయనే తీసి దాచినట్లున్నాడు" అన్నాడు. వాళ్ళు తన దగ్గరకు రాబోతున్న సమయంలో ఆ పురోహితుడు, "జగ్గారావు గారి నడగండి, ఆయన కిచ్చాను." అన్నాడు ఖంగారుగా. దామోదరం, జగ్గారావు ఇంకా రాలేదేమా అని హాలు వైపు చూశాడు. అంతవరకూ భానుమతి, నిస్పృహగా, నిర్వికారంగా, చేలనరహితంగా వుంది.

"ఓహో! ఇక్కడేదో పెళ్ళి జరుగుతోందే!" అంటూ, హాలులోంచి గదిలోకి ప్రవేశించాడు, ఇద్దరు లాయర్లు, ఇద్దరు పంచేలో, ప్రకాశం! అంతా చూసి చిరునవ్వు నవ్వాడు.

అందరూ అతన్ని చూసి నిర్ఘాంతపోయారు. అతను, అమాయకంగా మొహం పెట్టి, "ఎవరిది పెళ్ళి? గోపాలన్, నీదేనా? ఆ అమ్మాయి ఎవరు?" అని ప్రకాశం



అంటూంటే భానుమతి, "ఏమండి,చూడండి. వీళ్ళు నన్ను మోసం చేసి పెళ్ళి చేస్తున్నారు.." అని అనబోతూండడం, చుట్టూ వున్న ఆడవాళ్ళు ఆమె నోరు మూయ్యడం జరిగింది.

"ఛ! ఛ! అదేం పని? ఆ అమ్మాయిని వదలండి." అన్నాడు ప్రకాశం. వాళ్ళు వదిలేశారు. వెంటనే భానుమతి పరిగెత్తుకు అతని వద్దకు వచ్చి, అతని కాళ్ళ మీద పడి, "మీరు నా ఆపదలో అడ్డుపడ్డ దేవరులు. వీళ్ళు నన్ను బలవంతంగా వాడి కిచ్చి పెళ్ళి చెయ్యాలని చూస్తున్నారు" అని ఏడ్చింది. అతను ఆమె తల నిమిరాడు.

దామోదరం, రవుడీలకు సైగ చేశాడు, భానుమతిని తీసుకుపొమ్మని. వాళ్ళు ముందుకు రాబోతూంటే, ప్రకాశం వాళ్ళకేసి చూశాడు.

"షెడ్!" అని ప్రకాశం వాళ్ళకేసి చూస్తూ, "మీరిద్దరూ బయటకు పొండి!" అన్నాడు. వాళ్ళు పాడిలిపోతూ, బయటికి వెళ్ళారు.

"ప్రకాశం, నువ్విలా కూర్చో, ఆ అమ్మాయి నువిలా పంపు. పెళ్ళి కొద్దిగా తరువాయి వుంది. గోపాలన్, ఆ అమ్మాయిని తీసుకురా. మంత్రాలు చదువవ్వా! చూస్తావేం." అన్నాడు దామోదరం పురోహితుడితో.

"నేనడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పలేదేం? ఈ అమ్మాయి ఎవరు?" అన్నాడు గంభీరంగా ప్రకాశం. అందరూ ఒకరి మోహాలొకరు చూసుకున్నారు.

"ఎవరో, గోపాలన్ కొన్నాళ్ళు తనతో స్నేహంగా తిరిగాడట. తనని పెళ్ళి చేసుకోమని వాణ్ణి బ్రతిమాలింది. ఇప్పుడేందు చేతో ప్లేటు మార్చింది. కానీ, తొందరగా పెళ్ళి చేయించేద్దాం." అన్నాడు దామోదరం.

"ఛీ! ఛీ! నీ నాలుకను చీల్చినా పాపం లేదు. మానాన్నగారి స్నేహితుణ్ణనీ, ఆయన నీకు మాటిచ్చాడనీ, నన్ను మోసం చేసి, ఇప్పుడిలా అంటావా?" అంది భానుమతి కోపంతో వణికిపోతూ.

"మీనాన్న గారెవరు?" అని అడిగాడు ప్రకాశం.

"రామదాసుగారు. ఆయనను వీళ్ళే హత్య చేశారు"

"ఎవరా రామదాసుగారు?" అని దామోదరం వైపు చూశాడు ప్రకాశం. దామోదరం అతని వైపు చూశాడు. ప్రకాశం

# సుప్రభాతం

మొహంలోని గంభీరత అతన్ని కలవరపెట్టింది. అయినా ధైర్యంతో, "ఎవరో నాకేం తెలుసవ్వా. అదొక దారిపోయే మనిషి. పెళ్ళక్కర లేకపోతే పొమ్మను." అని దామోదరం అంటూంటే, అనంతరావుగారూ, ఉమా ప్రవేశించారు.

"ఎవరు దారిపోయే మనిషి?" అని అనంతరావు గారంటూంటే ఉమ వెళ్ళి భానుమతిని కౌగలించుకుంది. ఇద్దరూ ఏడ్చేశారు.

వీళ్ళని చూడగానే దామోదరం ముఖం పాలిపోయింది. ప్రకాశం, అనంతరావు గారి వైపు తిరిగి, "ఈ అమ్మాయి మీకు తెలుసా?" అని అడిగాడు. ఆయన, "ఓ! ఆమె నాకు తెలియకేం. భానుమతి! రామదాసు గారమ్మాయి. దామోదరానికీ బాగా తెలుసు. మా యింట్లోనే వాళ్ళిద్దరూ కలుసుకున్నారు." అన్నారు.

"నాకేం తెలుసు? మీరు రామదాసు గారమ్మాయంటే నిజమేననుకున్నాను. తీరా మేము వాకబు చేస్తే, ఆయన మాకు కావలిసిన వ్యక్తి కాదనీ, ఈమె మేము వెదుకుతున్న పిల్లకాదనీ తేలింది. అప్పటి నుండీ, మేమెంత వద్దంటున్నా మా వెనకాల పడి మా గోపాలన్‌ను పెళ్ళి చేసుకుంటానని గొడవ పెడ్తోంది. సరే, చదువుకున్న పిల్ల కదా అని జాలిపడ్డి ఈ పెళ్ళి కొప్పుకున్నాను ఆ అమ్మాయి ఇష్టం లేకపోతే మాకూ ఇష్టంలేదు. పద గోపాలన్, పోదాం" అని దామోదరం కదిలాడు. గోపాలన్ రెండడుగులు ముందుకేశాడు.

"మరి ఎవరికీ తెలియకుండా ఈ రహస్య వివాహం ఏమిటి?" అని ప్రకాశం అడిగాడు.

"పని ఒత్తిడి వల్ల, ఏర్పాట్లు సరిగా చెయ్యలేదని జగ్గారావు చెప్పాడు. నేను ఈ విషయం అతని మీద వదిలేశాను."

"అబద్ధం!" అని కేకేశారు అనంతరావు గారు. "ఈమె మీరు వెతుకుతున్న భానుమతే! ప్రకాశానికి తెలియకుండా ఈ విషయం రహస్యంగా వుంచి, ఆమెకు ప్రకాశం ఆస్తిలో సగం వాటా వస్తుందని, ఆమెను బలవంతంగా గోపాలన్ కిచ్చి వివాహం చేస్తున్నావు, దామోదరం! ఇప్పటికైనా ప్రకాశాన్ని మోసగించాలనే చూస్తున్నావు, కాని అది అంత సులభంకాదు. ఈమే మీకు కావలిసిన వ్యక్తి, అందుకు ఖూర్మనాథస్వామి గారు సాక్షి. ఆమె చిన్నతనప్పు ఫోటో ఒకటి వారి దగ్గర వుంది. దాని కాపీయే మీ దగ్గర కూడా వుంది. అవి రెండూ దగ్గరపెట్టి ఒక్కనిముషంలో రుజువు చేస్తాం." అని ఆవేశంతో అన్నారు అనంతరావుగారు.

"మీరంటున్న దేమిటో నాకు తెలియదు, నా దగ్గర ఏ ఫోటోలూ లేవు." అన్నాడు దామోదరం.

"అవును నీ దగ్గర ఏ ఫోటోలూ లేవని మాట వాస్తవమే అవన్నీ మాకు కావలిసి మేము తీసుకున్నాం." అంటూ, ఇన్‌స్పెక్టరు రజాక్ అయిదుగురు కానిస్టేబుల్స్‌తో సహా ప్రవేశించాడు. తిన్నగా దామోదరం వద్దకు వెళ్ళి, "రామదాసు గారి హత్యానేరానికి నిన్నరెస్టు చేస్తున్నాం." అని అతని చేతులకు బేడీలు తగిలించాడు.

"హత్యా! నేనేమీ ఎరుగనే." అన్నాడు దామోదరం, ఒక్కసారి తెల్లబోయి. రజాక్ చిరునవ్వు నవ్వాడు.

"ఇంకా అందర్నీ మోసగించాలని చూడకు. రామదాసుగారిని హత్యచేసి, ఆయన గదిలో మూల ఓ చిన్నగోతిలో దాచిన డబ్బూ, కాగితాలూ అపహరించింది నువ్వే! తరువాత దాలి వాయుడిని ఆ ప్రాంతంలో తిరగమని చెప్పి, వాడి మీదకు కేసు తోసేసావు. సైగా ప్రకాశం దగ్గర దాలి వాయుడి చేత అబద్ధా లాడించావ్. కాని మేము మాత్రం మొదటి నుండీ నీ మీద కన్ను వేసే వున్నాం. మొన్న మొన్నటివరకూ మాకు బలమైన రుజువు దొరుకలేదు. కాని గోపాలన్, భానుమతికి చూపించడం కోసం, నువ్వు దాచిన కాగితాలు తెచ్చాడు. అప్పటి నుండి మాకేసు బలమైంది." అన్నాడు రజాక్.

"అన్యాయం. నాకూ ఆ హత్యలకూ సంబంధం లేదు. ఆ కాగితాలు ఎలా వచ్చాయో నాకు తెలియదు." అని దామోదరం కోపంగా అన్నాడు.

"కాగితాలు ఒక్కటే అనుకుంటున్నావేమో.. ఆనాడు రాత్రి నువ్వు రామదాసు గారి ఇంటి వద్ద పొంచి చూస్తున్నప్పుడు నీకు దూరంగా వ్యక్తి ఒకరు ఆగుపడ్డారు. నువ్వు ఆయననంత లెక్క చెయ్యలేదు. కాని ఆయనకు నీ మీద అనుమానం వేసి, అక్కడికి కొంచెం దూరంలో, కిళ్ళీ కొట్టు దగ్గర కాస్సేపాగారు. నువ్వు రామదాసుగారి ఇంట్లోకి వెళ్ళడం ఆయన చూశారు. బయటకు రావడం చూశారు. ఆయన సాక్ష్యం

# తలనొప్పి

ఎక్కువగా ఉన్నా

# తలకేగా!

# అమృతాంజనం

## వాడి శీఘ్రంగా నివారణ పొందండి

స్థానికంగా ఉండే బాధను నివారించుకోడానికి లోపలికి మందులు ఎందుకు పుచ్చుకుంటారు? నొప్పిఉన్న చోటుమీద అమృతాంజన్ రాసి అమోఘంగా శీఘ్రంగా నివారణను పొందండి. ఏ అపాయం లేకుండా కండరాల నొప్పులకు, తలనొప్పికి, బెణుకులకు ఇంకా కీళ్ల నొప్పులకు అమోఘంగా గుణమిచ్చే అమృతాంజన్ 10 రకాల ఔషధాలు చేరిన మందు. అమృతాంజన్ గుండెజలుబుకే కాక సాధారణ జలుబులకు కూడా మంచి మందు. కొంచెంకొంచెమే ఉపయోగించవలసి ఉంటుంది కాబట్టి ఒక సీసా మీ కుటుంబానికంతాకలిపి నెలల తరబడి వస్తుంది.

అవసరానికి ఎప్పుడూ అమృతాంజన్ ఉంచుకోండి. అమృతాంజన్ 70 ఏళ్ల ప్రసిద్ధిని పొందిన నమ్మకమైన గృహఔషధం




అమృతాంజన్ నొప్పులు జలుబుల నివారణకు 10 రకాల ఔషధాలు చేరిన మందు

అమృతాంజన్ లిమిటెడ్,
మద్రాసు • బొంబాయి • కలకత్తా • ఢిల్లీ

మునుపు తెలియలేదు. కాని ఇప్పుడు దొరి కింది.''

''ఎవరా వ్యక్తి?'' అని ప్రకాశం అడిగాడు.

కొంచెం ఆగి, ''సుబ్బయ్య!'' అన్నాడు రజాక్. దామోదరం తల వంగిపోయింది. ప్రకాశం, ప్రశాంతమైన మొహంతో ''అయితే, దామోదరయ్యర్ నీ కిన్నాళ్ళూ భానుమతి సంగతి తెలిసే నాకు చెప్పలేదు. ఆమెను గోపాలన్ కిచ్చి వివాహం చేసి, ఆస్తిలో వాటా లాగాలనుకున్నావా, నిన్ను అన్నివిధాలా నమ్మిన నన్ను, ఇలా నాశనం చెయ్యాలనుకున్నావా? నీ మాటలు విని నేను ఎన్నోపనులు చేశాను. ఒకప్పుడు నాకు జీవితం మీద విరక్తి పుట్టినప్పుడు, నా మేలు కోరి నాకెంతో ధైర్యం చెప్పి మళ్ళీ నన్ను మనిషిని చేశావు. తరువాత నీ మనస్సిలా ఎందుకు మారింది? గోపాలన్‌కు డబ్బు కావాలంటే నేనిచ్చేవాణ్ణి. నువ్వు భానుమతి జీవితం నాశనం చెయ్యాలనుకున్నదెందుకు?''

దామోదరం తల వంచుకుని, ప్రకాశం మాటలకు జవాబు చెప్పలేదు. అందరూ దామోదరం వైపు చూశారు. అతను మాట్లాడ దల్చుకోనట్లు తెలిసింది. ప్రకాశం, ''ఇన్‌స్పెక్టర్! గోపాలన్‌ని అరెస్టు చెయ్యండి. వాడి మీద కావలసినన్ని నేరా లున్నాయి.'' అని ఆజ్ఞాపించాడు. అంతకు ముందే గోపాలన్ వద్ద కాపి వున్న ఇద్దరు కానిస్టేబుల్స్ వాడిని బంధించారు.

దామోదరం, ''వాడి దేమీ తప్పులేదు. చేసిందంతా నేను. వాడినేమీ చెయ్యకండి.'' అన్నాడు ఇన్‌స్పెక్టరుతో.

# సుప్రభాతం

''నా మాటలకి సరియైన సమాధానం చెప్పకపోతే, వాడిని నీతోపాటే ఉరికంబం ఎక్కించగల శక్తి వుంది నాకు. మర్చిపోయావా దామోదరయ్యర్, గోపాలన్ రహస్యాలన్నీ నా చేతిలో వున్నాయో?'' అని ప్రకాశం అరిచాడు.

''ప్రకాశం! నువ్వడిగిన మాటలన్నిటికి జవాబు చెప్తాను. వాడు అమాయకుడు వాడినేమీ చెయ్యకప్పా!'' అని దామోదరం కన్నీళ్ళతో అర్థించాడు.

''నువ్వు నాకు ఒక్కవిషయం కూడా దాచకుండా చెప్తేనే వాడు ప్రాణాలతో వుంటాడు. లేకపోతే నీ కళ్ళముందు వాడిని చిత్రవధ చేయిస్తా. చెప్పు? మొదటినుండీ చెప్పు?'' అన్నాడు ప్రకాశం.

దామోదరం చెప్పసాగాడు. ''అసలు రామదాసుగారికి పెదబాబు గారమ్మాయికీ మొదట పుట్టింది నువ్వు. అప్పటికి వాళ్ళకి వివాహం కాలేదు. అందువల్ల నీ జన్మ రహస్యం బైటపెట్టక, ఎవరో అనాథను పెంచినట్లు పెంచారు.'' అనేసరికి భానుమతి, ''ఏమిటీ, ప్రకాశంగారు నా అన్నయ్యా? అంది ఆనందంతో. ఆనంతరావుగారు, ''అవునమ్మా.'' అన్నారు.

''అన్నయ్యా!'' అంటూ ప్రకాశం చేతులు పట్టుకుంది భానుమతి. ''చెల్లీ!'' అని ఆమెను దగ్గరికి తీసుకున్నాడు, ప్రకాశం. ఆమె తల నిమురుతూ, ''ఈ దుర్మార్గుడి వల్ల మనిద్దరం వేరయ్యాం.'' అన్నాడు. అందరూ ఆ అన్నాచెల్లెళ్ళ కలయికను చూసి ఆనందించారు. ''ప్రకాశం, నా అన్నయ్యా! అబ్బ! నేనెంత అదృష్టవంతురాల్ని!'' అంది భానుమతి, ఆనంద బాష్పాలతో.

మళ్ళీ దామోదరం వైపు చూశారు. ''ఈ రహస్యం నాకు తెలుసునని ఎవ్వరికీ తెలియదు. ఆ విషయం కూడా బుజువు చేసే ఆధారాలు రామదాసు వద్ద వున్నాయి. పెద్దబాబుగారు, ఆస్తిలో సగం వాటా తన కూతురికిగాని, ఆమె పిల్లలకుగాని అని రాయడంలో వుద్దేశం ఇదే. ఆమెకు ఒక కొడుకూ, ఒక కూతురూ అన్న విషయం ఆయనకు తెలుసు. నీకా విషయం తెలియక పోబట్టి, ఆస్తి మీద హక్కు లేదనుకున్నావు.'' అని ఆగాడు దామోదరం.

''అంటే నాకు హక్కు వున్న ఆస్తినే నాది కాదని అనుకుని, ఎన్నో కానిపనులు చేసి, సొంతా నన్నమాట.'' అన్నాడు ప్రకాశం.

''అవును.'' అన్నారు దామోదరం.

''దానికి కారణం నువ్వే. ఈ సంగతి నీకు తెలిసి కూడా నువ్వు ఎందుకు నాకు చెప్పలేదు? అది చెప్పివుంటే నేనింత కష్టం తిని అనుభవించేవాడిని కాదు. ఇంతకాలం ఈ రహస్యం ఎందుకు దాచావ్?'' అని ప్రకాశం గర్జించాడు.

''నా స్థానాన్ని కాపాడుకోవాలని, నీకా విషయం తెలుస్తే నాతో నీకిక అవసరం వుండదనీ, చెప్పలేదు. అంతే కాకుండా ఆ విషయం ఏనాడూ చెప్పవలసి వస్తుందనుకోలేదు. భానుమతిని, మొదట నేననుకున్న ప్రకారం కడతేర్చి వుంటే, ఈ అవసరం వచ్చేది కాదు. కాని, గోపాలన్ కిచ్చి భానుమతిని వివాహం చేసి, ఆస్తిలో వాటా వాడికి వచ్చేటట్లు చేద్దామనుకోవడమే నా పొరపాటు. ఎవరో నా వ్యూహాన్ని పసిగట్టి, నాకన్నా అన్నీ ముందెత్తులు వేస్తూ వచ్చారు. నా ఆశలు భగ్నమైపోయాయి.'' అని దామోదరం తలదించుకున్నాడు.

''ఎంత దుర్మార్గం! నీ స్థానం కాపాడుకోవడం కోసం, ఎంతమందిని బలి చేశావ్! నువ్వు నాకెంతో ఉపకారం చేస్తున్నావను కుని నీ మాటలు ఇన్నాళ్ళు విన్నాను. చివరకు నువ్వు అందరి కన్నా నాకు తీరని అపకారం చేశావు. నా తండ్రిని హత్యచేశావు. నా చెల్లెల్ని అధోగతిపాలు చెయ్యాలని చూశావు. ఇంతకాలం నాకు ఆస్తి గురించి మనశ్శాంతి లేకుండా చేశావు. నువ్వు దుర్మా



కున్నదని నాకు తెలుసు. అయినా ఈ విషయంలో ఎంతో మంచి వాడననుకున్నాను. పాముకు పాలుపోసి పెంచితే, అది పెంచిన వాళ్ళనే కాటేస్తుంది. నువ్వూ అలాగే చేశావు. నువ్వు చెప్పకముందే ఈ విషయాలన్నీ నాకు అనంతరావుగారు చెప్పారు. కాని నేను నమ్మలేదు. నీ నోటి వెంటే నిజం వినాలని పరిగెత్తుకువచ్చాను. విన్నా సరియైన, రూపంలో చూశాను. ఛీ! ఇక నీ మొహం చూడకూడదు. తీసుకుపొండి." అని అరిచాడు ప్రకాశం.

ఇన్‌స్పెక్టరు రజాక్, కానిస్టేబుల్స్‌కు సౌంజ్ఞ చేశాడు. వాళ్ళు దామోదరాన్ని, 'పద' మన్నట్లు ముందుకు త్రోశారు.

"ప్రకాశం! గోపాలన్ హస్తం ఏ పాపం ఎరుగదు. వాడిని ఏమీ చెయ్యొద్దని, చేతులు రెండూ జోడించి ప్రార్థిస్తున్నాను." అన్నాడు దామోదరం, ప్రకాశం వద్దకు వచ్చి దీనంగా.

ప్రకాశం గోపాలన్ వైపు చూసి, "నువ్వు నాక్కనిపించకుండా వెళ్ళిపో" అన్నాడు, అన్నదే తడవుగా వాడు బయటికి వెళ్ళిపోయాడు. దామోదరాన్ని తీసుకుని పోలీసులు వెళ్ళిపోయారు.

అనంతరావుగారు, "తను త్రవ్వుకున్న గోతిలో తనే పడ్డాడు దామోదరం." అన్నారు. అందరూ తలలూపారు.

జగన్నాథరావుగారు లోపలికి వచ్చి, ప్రకాశం చేతులు పట్టుకుని, "ప్రకాశంగారూ నాకు విషయమంతా తెలియక దామోదరం యొక్క మోసంలో పడి, అతనికి సాయం చేశాను. నన్ను క్షమించండి" అన్నాడు.

ఆయన వెనకాలే మాలతి, బెనర్జీ వచ్చారు. ప్రకాశం, "సాధారణంగా అయితే నేను మిమ్మల్ని క్షమించేవాడిని కాదు. కాని మీ అబ్బాయి బెనర్జీ వల్ల ఇవాళ భానుమతి రక్షించబడింది కాబట్టి, మిమ్మల్ని అతని మొహం చూసి వదిలేస్తున్నాను" అన్నాడు.

"ఏమిటి? మా బెనర్జీయా?"

"అవును. సాయంకాలం భానుమతి మీ యింట్లో బంధింపబడగానే, బెనర్జీ ఆ విషయం పోలీసు ఇన్‌స్పెక్టరు రజాక్‌కు తెలియబర్చాడు. మీ యింటి చుట్టూ పోలీసు లుండడమేకాక, మీకు పురోహితుడిగా వచ్చింది ఒక సి. ఐ. డి. ఆఫీసరు. మేము సాయంకాలమే వూళ్ళోకి వచ్చాము. వెంటనే మాకు సంగతులన్నీ తెలిసాయి. సరాసరి మీ యింటికి వచ్చాం."

అనంతరావుగారు, "ఇక మనం వెంటనే బయల్దేరాలి. సత్యమూర్తి మన కోసం, మా యింటి వద్ద ఆందోళనతో ఎదురు చూస్తుంటాడు. అతన్ని అక్కడ వుంమని చెప్పివచ్చాం" అన్నారు.

అందరూ బయల్దేరారు.

(సశేషం)




ఆకాశంలో పశ్చిమదిశ జేగురు రంగు పులుముకుంది. నలుదెసలా క్రమ్ముకొస్తున్న చీకట్లని చూసి ఆందోళనగా త్వరితంగా తమ తమ నెలవులకు సాగిపోతూన్నయ్ పక్షుల సమూహాలు.

ప్రయాణపు బడలికతో పగలంతా నిద్రపోయిన నాకు ప్రకృతి ఎంతో అందంగానూ, ఆహ్లాదకరంగానూ, కళాత్మకంగానూ గోచరించింది. నిర్మలాకాశంలో దూరాన ఓ నక్షత్రం తళుక్కుమంటూ మెరిసింది. చటుక్కున రాజేశ్వరి గుర్తు కొచ్చింది నాకు.

"నీ కళ్ళల్లోని వెలుగంతా రాశీభూతమై మంటి వెలుగుతోంది అదిగో రాజీ!" అంటూ తన వ్రేలితో— భావావేశంగా చూపిన ఆ రోజున—

కిలకిలా నవ్వింది రాజేశ్వరి.

"నా కళ్ళల్లోని వెలుగుకీ— ఆకాశంలోని ఆ నక్షత్రానికీ ఎన్ని లక్షల— కోట్ల యోజనాల దూరమో ఆలోచించావేం? ఏదైనా ఉపమానం అన్ని విధాలా అతికేలా వుండాలి!"

"నా హృదయగత భావావేశం మాటలతో వ్యక్తంచలేనిది, ఒకరికి అర్థంకానిది! నిన్ను చూస్తుంటే.........."

"కాని ఓ సంగతి! ఎంత అర్థం కాకుండా వర్ణిస్తే, అది అంత అద్భుతమైన కవిత్వం అన్నమాట! కనుక నీవూ ఒక నవకవివే!

"నవకవీ! .........
ఓ నవకవీ!
వ్రాయవోయి కవిత్వం!
పాడవోయి ఒక భావగీతం!!"

మంద్ర మంద్ర స్వరంతో—పరిహాసపూర్ణంగా పాడే రాజేశ్వరి!—నవ్య చైతన్య స్రవంతి!

అపూర్వమైన వ్యక్తిత్వంగల పరిపూర్ణ స్త్రీ మూర్తి!!

వెళ్ళాలి! వెళ్ళాలి!— చూసి రావాలి! మనసు తొందర చేస్తుంటే—

"అమ్మా! అలా వెళ్ళివస్తానమ్మా!" అన్నాను గట్టిగా లోపలికి వినిపించేలా.

"చీకటి పడుతోంది రాధా! ఇప్పు డెక్కడికి? ఇవాళ కార్తీక పౌర్ణమికదూ! దీపాలు వెలిగిస్తాను చూడవూ?" అమ్మ లోపలినుంచి వస్తూ అడిగింది.

"ఇప్పుడే వస్తానమ్మా! అదిసరే— మరి పేరంటాళ్ళు వస్తారేమో?" సంకోచంలో ఆశ తళుక్కుమనగా అమ్మవైపు ఆత్రంగా చూసేను.

"వస్తే ఏంరా? నీకు తెలియని వాళ్ళు ఎవరున్నారని? శాంతమ్మత్తయ్యా, కనకమ్మొదిని, మంగమ్మ అమ్మమ్మా......"

మధ్యలో కలుగజేసుకుని—

"రాజేశ్వరి రాదామ్మా?" అన్నాను ధైర్యంచేసి.

"అది ఈరోజు ఉపవాసం వున్నదట! దీపాలు వెలిగించుకోవాలని......వీలుపడితే వస్తానని కబురు చేసింది. నువ్వుగాని అక్కడికి వెళ్తున్నావా?"

పసిగట్టిన అమ్మవైపు చూసే ధైర్యంలేక....

"లే......లేదమ్మా! సూర్యం రమ్మని కబురు చేస్తే........"

"సరే వాయనా! పెంద్రాళే రా! అసలే పల్లె

టూరా— వీధులు చీకటిగా వుంటయి. నీకు అలా పాటు తప్పిందాయిరి.''

మెల్లిగా వీధిలోకి జారుకున్నాను.

పెరట్లో తులసికోటముందు ముత్యాల్లా ముగ్గులు తీర్చిదిద్ది—ప్రమిదలు వెలిగించి—శ్రావ్యంగా పాటపాడుతోంది రాజేశ్వరి.

ఆ దీపాల వెలుగులో పాలరాతి శిల్పంలామెరుస్తూ పవిత్రభావం కలిగించేలా— గోచీ పోసకట్టిన చీరె— పెద్దకుంకుమబొట్టు, కాళ్లకు పసుపు—పెద్ద ముత్తయిదువలా తులసికి ప్రదక్షిణాలు చేస్తుంది. నన్ను చూసి నవ్వింది.

''సమయానికే వచ్చావు నాయినం వృమ్మకో రాధమ్మా!''

అప్పటి చిలిపితనం ఇంకా చిందులాడుతూ వున్నది. కిలకినవ్వుల నిర్మలత్వం ప్రస్ఫుటంగా వ్యక్తమవుతోంది.

ఆమె వేసిన పీటమీద కూర్చుంటూ నేనూ నవ్వాను.

''అప్పటికీ— ఇప్పటికీ నీలో మార్పులేదు రాజీ!''

''కాని రాధా నీవు మారిపోయావు సుమా! ఇంతింత పెద్ద మీసాలు ఎవర్ని భయపెట్టటానికి?'' తిరిగి పూసిరాడకుండా ఒకటే నవ్వు!

హాయిగా నేనూ నవ్వేను—

కొద్దిసేపు నిశ్శబ్దంగా గడిచిపోయింది. రాజేశ్వరి పూజను శ్రద్ధతో గమనిస్తున్నాను. పూజ పూర్తిచేసుకుని నావైపు తిరిగి నవ్వుతూ—

''ఇంకా నిద్రమత్తు వదల్లేదా? అలా వెర్రి నంగా కూర్చున్నా వేమిటీ? వోయ్! రాధాకృష్ణ దయితే తన సుప్రభాతం!''

''నీపూజలోని ఏకాగ్రతను వీక్షిస్తున్నాను రాజీ! నీలో ఇంత నిశ్చలత, కుదురు ఎలా వచ్చినయ్యా అని యోచిస్తూ!''

''తెల్లవార్లూ ఇలా యోచిస్తూనే కూర్చో! ఇందా! ప్రసాదం తీసుకో!''

చేతులు చాపాను.

జామపండు ముక్కలు, వడపప్పు, అరటిపండు ముక్కలు, కొబ్బరి కలిసినప్రసాదం దోసిలినిండా పెట్టింది.

''ఇదంతా తినటానికేనా?'' ఆశ్చర్యంగా ఆమెవైపు చూస్తుంటే ఫక్కున నవ్వి—

''ప్రసాద భక్తులుంగారూ! నాదగ్గర నటించకండి! తమరు చిన్నప్పుడు శివుని గుళ్లో ఎన్నిసార్లు ప్రసాదంకోసం ఎగబడేవారో నాకు గుర్తుంది.'' అన్నది తనూ వో పీట నా కెదురుగా వేసుకుని.

''కాని నేను మారిపోయానని నీవే అన్నావు కదూ?'' తీశాను దెబ్బ!

''మనిషి మారింది. మనసు ఎదగలేదుసుమా!''

''అదిసరే! ఇంకా పొలంనుంచి రాలేదా శ్రీవారు'' కుతూహలంగా, నలుదెసలా కలయజూస్తూ అడిగాను.

''వస్తారు! అంత తొందరపడ్తావేం? ఇంకా ఏడయినా కాలేదు టైము!''

''కాని చీకటిపడింది—ఇంకా పొలమే?''

ఇంత అందమయిన భార్యకు దూరంగా—బయట గడుపుతూన్న ఆ వింత మనిషిని చూడాలనిపించింది.

''పొలంకాకపోతే పుట్ట! నీ కీ ఆసక్తి ఎందుకో నాకు తెలుసు! నన్ను పరీక్ష చేయాలని వచ్చావా ఏం? ఈరోజు??''

గంభీరంగా మారిపోయిన ఆమె ముఖం వైఖరి గమనించి—ఆశ్చర్యబోయేను.

''నువ్వెందు కలా భావిస్తున్నావు? స్నేహపురస్కారంగా పలుకరిద్దామనివచ్చాను!'' నన్ను నేను సమర్థిస్తూ అన్నాను.

''రాధా! నువ్వెంత అమాయకుడివి! విడమర్చి చెప్పితేకాని అర్థం చేసుకోలేవా?''

''నువ్వనేదేమిటి రాజీ?'' సూటిగా అడిగాను తలెత్తి ధైర్యంగ చూస్తూ. అంతా నాకు వింతగా వున్నది. నే అడిగినదానిలో అపరాధమేమిటో తెలియటంలేదు.

''మా వారిని గురించి వినలేదా?'' స్వరంతగ్గించి ఎటో చూస్తూ అడిగింది రాజేశ్వరి.

లేదన్నట్లు తల అడ్డంగా తిప్పేను.

నిట్టూర్చింది. క్షణంలో ఆమె ముఖకమలం మీద తిరిగి నవ్వుల పువ్వులు విరిశాయి.

''రేపు మధ్యాహ్నం సావకాశంగా రా రాధా! పరిచయం చేస్తాను.''

''అంటే నన్నిప్పుడు వెళ్లమని అర్థమా?''

దీనంగ తలూపింది కాదన్నట్లు.

''నన్నర్థం చేసుకో రాధా! నీ రాజి నీకు క్రొత్త విషయమా? అలా ఎన్నడయినా శాసించగలనా?''

''గలవు రాజీ! శాసించగలవు! తలుచుకుంటే శిక్షించగలవు కూడా!'' అనుకున్నా మనసులో.

''నేనే పొరబడ్డాను. నువ్వు మారవు రాజీ! మనిషికాదు—మనసు!'' అన్నా ఎత్తిపొడుస్తూ.

''ఒప్పుకుంటాను. అప్పటి జీవితం వేరు. ఇప్పటి జీవనం వేరు. మధ్యకాలంలో ఎన్నో అనుభవాల మైలు రాళ్లు మనసు ఎదగటానికి దోహదం చేసినయ్. ఏమైనా గతం సుఖప్రదమైనది రాధా!''

''వర్తమానం గడ్డుగా వున్నదా?'' లోతుగా చూడటానికి ప్రయత్నించాను.

ఆ దీపాలకాంతిలో శుష్కహాసం చేసిన రాజేశ్వరి మూర్తిని జన్మలో మరిచిపోలేను.

''వ్యర్థమైన ఆసక్తితో మంరొకరి జీవితంలోకి తొంగిచూడ ప్రయత్నించి నీ విలువపోగొట్టుకోకురాధా! నేనే ఒకరోజు నీతో ప్రస్తావిస్తాను! నీవంతట నువ్వు అడిగితే నా హృదయం మండిపోతుంది. ఈ ప్రపంచంలోని ఒక సామాన్యునిగా నిన్ను భావించుకోలేను.''

రాజేశ్వరి నాకు అర్థం కాలేదు!

ఆమె మాటలూ అర్థంకాలేదు.

మొదటినుంచీ లోతుగా మాట్లాడే స్వభావం! ఆమె అందించిన బాదం ఆకులో ప్రసాదం భద్రపరచి లేచి నిలుచున్నాను — శలవు తీసుకోటానికి చిహ్నంగా.

''రేపు తప్పకుండా రా—రాధా!''

''అలాగే— అతనొచ్చేవరకూ ఒక్కదానివేనా?''

సందేహిస్తూ చూశా నామె వైపు.

''అవును భయం దేనికి? అయిదేళ్లుగా జరుగుతున్నదేగా!'' తేలికగా నవ్వింది.

''అన్నట్లు నీవాయినం నా కిస్తానంటివిగా?''

''ఫారిన్ రిటర్న్‌డ్‌గారికి మా పల్లెటూరి ఆతారాలు మోటుగా వుండవూ?''

''లేదు! ముచ్చటగా వుంటయ్!''

''సరే అయితే— ఆ వంట ఇంట్లో నా మడి చీరె పంకిన వున్నది. కట్టుకుని పస్తారా రాధమ్మగారూ?''

మనసారా నవ్వుకున్నాం.

ఒంటరిగా ఇంట్లో ఒక్కతే— అతనొచ్చే వరకూ గడుపుతూన్న రాజేశ్వరి నిజంగా అఖండ సాహసవంతురాలు అన్పించింది.

జోళ్లు తొడుక్కొని—

''వస్తా రాజీ!'' అన్నా చివరిమాటగా.

అంతే!

'ట్రాంబే ఎటామిక్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్'లో ఉద్యోగానికి నన్ను సెలక్టు చేసినట్లు, వెంటనేవచ్చి జాయినవమని టెలిగ్రాం వచ్చింది. ఉదయాన్నే మరుసటిరోజు వెళ్లామనుకున్న నాకు— మళ్లీ అరు సంవత్సరాలవరకూ వీలుపడలేదు— రాజేశ్వరిని కలుసుకోవటం.

ఇక్కడ రాజేశ్వరిని గురించి కొంత మీకు చెప్పాలేమో!

బాల్యంనుంచీ ఇద్దరం ఆటలలో— పోట్లాటలలో జమాజట్టీల్లా వుండేవాళ్లం. నాకంటే నాలుగేళ్లు పెద్ద రాజేశ్వరి. నా చెవి మెలిపెడ్తూ నాపై అధికారాన్ని చెలాయించింది రాజేశ్వరి. మా ఇంట్లో ఎంతో చనువుగా తిరుగుతూండటం మూలాన అడ్డూ ఆపూ లేకుండా నన్నేడిపించేది. నా దగ్గర ఎంత అధికారాన్ని చూపేదో— ఇంటిదగ్గర అంతటి వినయంగానూ, భయపడుతూ పెనితిల్లి చెప్పు చేతల్లో వుండేది.

నన్ను చెవి మెలిపెట్టినప్పుడల్లా— ''మాపిన్నితో చెబుతానుండు!'' బెదిరిస్తూ అనేవాడిని. ''చెప్పుకో వోయ్! నాకేం భయం?'' అనేది ధీమాగా. ఏమిదో ఏడు నిండకముందే ఉడుగుచేసి పెళ్లి చేయించారు నాకు మా పిన్ని.

ఎప్పుడూ నా పిలకని ఎగలాగి పట్టించేది రాజేశ్వరి. పరధ్యాన్నంగా నుంచున్న నన్ను యాలల్లో వెనుకగావచ్చి పిలకపట్టి గట్టిగా గుంజేది. కళ్లల్లో నీరునిండి— బాధగా తల నిమురుకుంటూ—

''నువ్వు రాజేశ్వరివా? మహాంకాళివి, పోలేరమ్మవు, దయ్యానివి, బ్రహ్మరాక్షసివి'' అక్కసుగా, రోషంగా తిట్టేవాడిని నేను. నేను తిట్టిన కొద్దీ నవ్వేది.

''హోయివెర్రివాడా నా పేరులోనే అన్నీ ఇమిడి వున్నాయ్. నేనే అన్ని అవతారాలూను. నువ్వు ఎంత తిట్టినా—అవి తిట్లుకాదు నా నామాక్షరాలు'' అనేది స్టైగా.

ఎటూ చేయలేని పరిస్థితుల్లో ఉడుక్కొని పిచ్చివాడిని—చూస్తూ. నాకంటే బాలేదు పొడుగున్న

# రాజేశ్వరి

[illegible] ? నిజంతో ఆ మాటకి అవసరంలేదు. ఇటి సమయంలో పిన్ని నన్ను చూపిన సంబంధం కాదనలేక పోయాను. నా సచ్ఛీలతను, పవిత్రతను, మంచితనాన్ని నిలుపుకోవాలంటే అదే శరణ్యం. ఆతను స్ఫురద్రూపి, అన్నీ సరుడు! అయితే చదువు లేదు. అయినా అంగీకరించాను. పెళ్లయింది. అప్పుడునువ్వు విదేశాలలో వున్నావు.

నా వైవాహిక జీవితంలో— "నేను నా జీవితంలో నీనదైనా మనిషిగా జీవించానా?" అని భావికాలంలో పునశ్చరణకు ఉపయోగంగా, సుఖంగా నిట్టూర్చటానికి భగవంతుడు ప్రసాదించిన రోజులు కాపురానికి వెళ్లిన క్రొత్తదినాలు! క్రమక్రమంగా నువ్వింత అదృష్టానికితగవు అంటూ విధి పరిహసించి క్రిందకు తోసింది.

'రోగం రట్టు—, కాపురంగుట్టు' అన్నారు. నీ నుంచి నా జీవితం మరుగు వుంచటానికిమరో కారణం కూడా వున్నది. నన్ను అభిమానంతో, ప్రేమలో, గౌరవంతో దేవతలా ఆరాధిస్తున్నావు. నాకైనే ఁ పరిస్థితులు విప్పిచెప్పి— నీదృష్టిలో పలుచనై— సాధారణ స్త్రీలా దిగజారి చులకనై పోవటం ఇష్టంలేదు. ఇందులో అనుచితం ఏమీలేదనుకుంటాను.

కానిరాధా! నేనూ స్త్రీనే! నాలోనూ కొన్ని బలహీనతలున్నాయని అనుభవం మీద తెలుసుకున్నాను

నాభర్త నన్ను అనుక్షణం అనుమానించేవ్యక్తి! కోపం మనిషిలోని వివేచనను, మానవత్వంను రూపుమాపుతుంది. పర్యవసానం ఎదుట వ్యక్తిపై చేయిచేసుకోవడం! నా విషయంలో కూడా అదేజరిగింది.

దానికి నేను బాధపడలేదు.

ఎందుకంటే ఇటువంటి బాధలు— భావికాలంలో ఎదురవుతాయని ముందు చూపుతో— నాకుపిన్ని తర్ఫీదు ఇచ్చింది.

శరీరం ఒకరోజునెప్పి, మరో రోజుబాధ. కొన్ని సంవత్సరాలుగా అదే కార్యక్రమానికి గురి అవుతే మొండిబారిపోతుంది.

అందుకే నేను బాధపడలేదంటున్నాను!

నాభర్తలోని మరో సుగుణం— పరస్త్రీ వాంఛ!

ఎంతటి సౌందర్యవతిఅయినా, సుగుణవతి అయినా 'భార్య' అవగా అతనిదృష్టిలో "పనికిరాని వాజమ్మ" లా కనపడి— దూరపుకొండలు నునుపులా ఇతరులపై వ్యామోహపడే— దౌర్భాగ్యపు భర్తలు ఈదేశంలో కో— కొల్లలు. ఈ కోవకుచెందినవారు నా భర్త. పటం నా అదృష్టం కాదంటావా?

ఆయనలో ఈజారత్వం ఒకవిధంగా నాకు మనశ్శాంతి కలుగజేసింది.

నిరంతరం అనుమాన దృక్కులతో—"అక్కడ నించున్నావేం? ఎవరున్నారని?"— "పేరంటానికా? సింగారించుకుని నలుగురూ చూడాలనా?" అనేమాటలతో మనసులో ఏహ్యభావం జనింపజేసిన అతనితో నేను సుఖించేదేముంది? తను అలస్యంగా ఇంటికి రావటానికి కారణం ఇదే!

'ఇంతఇంట్లో నీకు భయంవేయదా' అని అడిగావు గుర్తుందా? భయంకాదు. మనశ్శాంతిగా, హాయిగా వుంటుంది నా ఏకాంతం!

ఆయన ఇంట్లోవున్నంతసేపూ— బోనులోవున్న ఎలుకపరిస్థితే!

అన్నికళలూ పరిపూర్ణంగావున్న ఆయనని చూసి ధనలక్ష్మి భయపడి దూరమైంది.

అందుకనే మాఇంటిసంగతి దొంగలకుకూడా బాగా తెలుసు అన్నాను నీకు జ్ఞాపకమేనా?

ఇన్ని అదృష్టాలకూ— పిల్లలనే దురదృష్టం జోడించలేదు భగవంతుడు! ధన్యురాలనే! ఎందుకంటావా?

నా కడుపునపుట్టి— నాకంటే అదృష్టవంతులు అవుతారేమో అనే దిగులులేకుండా చేశాడు.

నాఆలోచనలవేడికి, అనుతాపాలతాకిడికి కరుగుతుంచి [illegible] శరీరం. దేవతనన్ను వరించింది. ఇకనేను నిశ్చింతగా వెళ్తున్నాను. వంట చేయటానికికూడా పనికిరాను. చేసిపెట్టేవారులేరని జాలితో పుట్టింటికి సాగనంపారు శ్రీవారు.

మానాన్న పరమపదించి ఏడాదవుతోంది. నీకు తెలియదనుకుంటాను. అయినా అయిష్టంగానే ఆదరించింది పిన్ని.— మందులిప్పించలేకపోయినా! ఇప్పుడు అక్కడినుంచే నీకీ ఉత్తరం! ఇక్కడకాలం రోజులు క్షణాలలా దొర్లిపోతూ నన్ను మృత్యుముఖమునకు ముందుకుతోస్తూంది. వ్యాధి తీవ్రతరమయింది.— అయినా నాకెందుకో దిగులు అనిపించదు. నా అంత సుఖంగావుండే ప్రాణి మరొకటి లేదేమో! అన్నంత నిశ్చింతగా వుంటుంది మనసు.

రాధా! నీకీఉత్తరం వ్రాయడానికి అసలైన కారణం ఏమిటో తెలుసా?

నేను ఎక్కువకాలం జీవించనని నాకు తెలుసు. నిజంచెప్పాలంటే బ్రతకాలనీలేదు.— విరక్తికాదు. ఎందుకు జీవించటం? ఎవరికోసం?? భూమిమీద నేను నిర్వర్తించవలసిన పనులన్నీ అయిపోయినయ్. కాని—,

నాగురించి నీలోవున్న భావాలు నాకు తెలుసు! నీనుంచి ఏదో దాస్తున్నానని, పరాయివాడిగా భావిస్తున్నానని— నీ ఆవేదన! అపోహ!! వీటికి నివృత్తే ఈ ఉత్తరం!

పోతూ—పోతూ నీమనసులోని నాస్థానాన్ని చెరిపివేసుకోలేక నీరాజేశ్వరి తన హృదయం నీముందు వుంచింది.

నాకేదో అన్యాయం జరిగిందనీ, ఏదేదో కష్టాలపాలయ్యాననీ దిగులుచెందకు! నేనెప్పుడూ భవిష్యత్తును అందంగా, మధురంగా వూహించుకోలేదు. అవి కావాలనీ, ఇవి లేవనీబాధపడలేదు. బహుశః ఈ కారణంవల్లనే కావచ్చును— నాసంసార విషయాలు నన్నంతగా బాధించలేదు. కుమిలి దుఃఖించలేదు. అన్నీ యాంత్రికంగా జరిగిపోయినయ్.

ఇప్పుడు అనిపిస్తుంది రాధా! మనమెవరం? నిమిత్తం మాత్రులం! ఈభవబంధాలను త్రెంచుకుని ఎక్కడికి వెళ్తామో తెలియదు! మళ్లీ జన్మంటూ నిజంగావుంటే— మనంమళ్లీ ఇలానే జనించి— మన స్నేహం చిరకాలంగా— పరిమళశోభితంగా—వర్ధిల్లాలని కోరుతూ,— రేవతికి ఆశీస్సులతో

నీ రాజేశ్వరి.

కాగితాలు మడిచి టేబుల్పై పడవేశాను. చెమర్చిన కళ్లను జేబురుమాలతో వత్తుకున్నాను.

"రాజేశ్వరీ! నువ్వు అమృతమూర్తివి! దేవతాస్వరూపిణివి! నీసహనశీలతముందు నేను అల్పుణ్ణి! అవివేకిని! నన్నుక్షమించు! అపార్థం చేసుకున్నందుక్కా —నాకు తెలుసు! నువ్వు క్షమిస్తావన్నా!" కనుదోయినుండి జలజలా రాలుతున్న అశ్రువులను తుడుచుకుంటూ అనుకున్నాను.

ఆతర్వాత తెలిసింది రాజేశ్వరి చనిపోయిందని. కానీ నాకు— 'సెలయేటిగలగలలో పవిత్ర మూర్తీభవించిన స్త్రీమూర్తులలో, నిర్మలాకాశంలో మెరిసే నక్షత్రాలలో, కార్తీక పౌర్ణమికి వెలిగించే దీపాలలో— నవ్వుతూ సాక్షాత్కరించి "నేను అమరజీవిని రాధా!" అన్నట్టుగా అనిపిస్తుంది.



# రామశాస్త్రి

## వి.ఎస్.సుక్తాంకర్

(జరిగిన కథ: పేష్వా మాధవరావ్ మరాఠా సామ్రాజ్యం ప్రధాన న్యాయమూర్తి రామ్‌శాస్త్రి సలహాని అనుసరించి పరిపాలనలో కొన్ని సంస్కరణలు అమలు జరుపుతూ ఉంటాడు. అతని తర్వాత నారాయణరావు పేష్వా అవుతాడు కాని రఘోబా ఘర్దీల సహాయంతో అతనిని హత్య చేయించి తనే పేష్వా అవుతాడు. రామ్‌శాస్త్రి రఘోబా హత్యకి కారకుడని శ్యామా సహాయంతో రుజువుచేసి, హంతకుడు పేష్వా అయిన రాజ్యంలో తనకి స్థానం లేదని పదవిని వదులుకుని ఒక మారుమూల గ్రామంలో భార్య, కుమారులతో అజ్ఞాతంగా ఉంటూ ఉంటాడు. కాని, ఇంతలో నానాఫడ్నవీస్, సఖారామ్ బాపూ వంటి నాయకులు రఘోబాని బహిష్కరించి నారాయణరావు శిశువుని పేష్వాచేసి, రామ్‌శాస్త్రి కోసం వెదుక్కుంటూ వచ్చి తిరిగి ప్రధాన న్యాయమూర్తిగా మరాఠా సామ్రాజ్యం పట్ల తన కర్తవ్యాన్ని నిర్వహించమని కోరుకుంటారు! భార్య సీతాబాయి ప్రోత్సాహంతో రామ్‌శాస్త్రి అంగీకరిస్తాడు.)

## 14

"విలాయత్ (ఇంగ్లాండు)కి వెళ్లిన వకీల్‌లు (రాయబారులు) ఇద్దరూ తిరిగి వచ్చేశారు. విలాయత్‌కి వెళ్లిన వకీళ్లిద్దరూ తిరిగి వచ్చేరు."

అంటూ హడావుడిగా వెళ్లి చెప్పారు ఇద్దరు భటులు కార్భారీతో.

"కార్భారీగారూ! ఇద్దరు వకీళ్లూ మన భవనం ద్వారం దగ్గిరకి వచ్చేస్తున్నారు!" అన్నాడు ఒకడు. కార్భారీ సంభ్రమాశ్చర్యాలతో లేచి రాజభవన ద్వారం వైపు పరిగెత్తాడు. త్వరలో ఈ వార్త ఆ భవనం అంతా పాకిపోయింది. రఘోబాతోపాటు బొంబాయికి వచ్చి ఉంటున్న అతని అనుచరులందరూ చాలా సంతోషించారు. పేష్వా అయిన కొద్దిరోజులలోనే రఘోబా ఒక పెద్ద ఎత్తు వేశాడు. మరాఠా సామ్రాజ్యానికి కంటకంగా ఉంటూ వచ్చిన హయిదర్ ఆలీ మీదకి దండెత్తివెళ్ళి, అతన్ని ఓడించి దిగ్విజయుడుగా తన రాజధానికి తిరిగి వస్తే తన కీర్తి అమితంగా పెరిగి తన బలం అధికం అవుతుందని అనుకున్నాడు. రామ్‌శాస్త్రి ఆరోపణలవల్ల ఏర్పడిన చిక్కులు చాలావరకూ విడిపోతాయని రఘోబా అనుకున్నాడు. కాని నానా ఫడ్నవీస్, సఖారామ్ బాపూ-వీరిద్దరూ కలిసి రఘోబాని పేష్వా పదవి నుంచి తొలగించారు. మరికొందరితో ఒక 'మంత్రి మండలి' ఏర్పరచి రాజ్యపరిపాలనా భారాన్ని తామే స్వీకరించారు.

బొంబాయి పారిపోయిన రఘోబా అక్కడ బ్రిటిష్ అధికారుల సహాయాన్ని అర్థించాడు. వారుకూడా ఇదొక సదవకాశం అనుకుని పూనా మీద దండెత్తి పోయిన రఘోబాసేనతో తమ సైన్యాన్ని పంపించారు. కాని, హరిపంత్ ఫడ్కే నాయకత్వం కింద మరాఠా సైన్యం రఘోబా దండుని తేలికగా ఓడించింది. ఈ వార్త కలకత్తా దాకా పాకింది. అక్కడ బ్రిటిష్ గవర్నర్‌జనరల్ బొంబాయి గవర్నర్‌ని, 'వెంటనే మరాఠా సామ్రాజ్యంతో యుద్ధం విరమించవలసిన'దని ఆజ్ఞాపించాడు.

రఘోబా, బ్రిటిష్ గవర్నర్‌జనరల్ తనకి ద్రోహం చేశాడనుకుని మండిపడ్డాడు. అంతటితో తన ప్రయత్నాలు విరమించకుండా ఇంగ్లండ్‌కి ఇద్దరు రాయబారులని పంపాడు. వీరిలో ఒకవ్యక్తి దోరాబ్జీ, పార్శీ తెగకి చెందినవాడు, రెండవ వ్యక్తి కేశోపంత్ బ్రాహ్మణ కులస్థుడు. ఇంగ్లండ్‌లో 'ఎడ్మండ్ బర్క్'ని కలుసుకుని, అతనికి నచ్చచెప్పి అతని పలుకుబడి ద్వారా భారత దేశంలోని 'ఈస్ట్ ఇండియా కంపెనీ' అధికారులు తన పక్షం వహించేట్లు చేసే బాధ్యత వారికి ఒప్పగించాడు రఘోబా.

రాజభవన సింహద్వారం వద్ద రాయబారులిద్దరికీ ఘనమైన స్వాగతం లభించింది. తీసుకువెళ్లాడు.

'వకీళ్లు' ఇద్దరూ రఘోబాకి వినయంగా వంగి సలాము చేశారు.

"రఘోబాజీ! ఇంగ్లండ్‌లో మా ప్రయత్నాలు ఫలించాయని మీకు తెలియజేయటానికి సంతోషంగా ఉంది! ఇదుగో మాకృషి ఫలితం!" అంటూ దోరాబ్జీ తన దుస్తుల్లో భద్రపరచిన అంగీకార పత్రాన్ని బయటికి తీశాడు.

"ఈ అంగీకార పత్రం సంపాదించటానికి ఎన్ని కష్టాలు పడ్డామో దేవుడికి తెలుసు! ఫాక్స్, షెరిడాన్, బర్క్ ప్రభృతులనే కాక ఇంకా ఎందరినో కలిశాము.. వారందరూ మీ తరఫున కృషి చేస్తామని మాట ఇచ్చారు! వచ్చే 'పార్లమెంట్ సెషన్'లో మీ వైపునే వాదిస్తారు చూడండి...." అన్నాడు రెండవ వకీల్ కేశోపంత్.

రఘోబా సంతోషానికి అంతులేదు. "కార్భారీ!" అని ఆ అధికారిని పిలిచాడు. ఈ పిలుపు కోసమే వేచి ఉన్న కార్భారీ బంగారు నాణాలతో నిండిన రెండు వెండి పళ్లేలని తెచ్చి వకీళ్ల ముందు ఉంచాడు.

"మీ కృషి ఫలితంగా ఈ బహుమతులని స్వీకరించగోరుతున్నాము! మీ మేలు మరిచిపోలేము!" అన్నాడు రఘోబా. ఇంతలో కార్భారీ మళ్లీ మరికొన్ని కానుకలు తీసుక వచ్చి వకీళ్లకి ఇచ్చాడు.

"మీ రిద్దరూ మా విషయమై ఎంతో కష్టపడ్డారు! మాకు తోచినట్లు సత్కరించాము.. మరొకసారి వివరాలన్నీ చెబుదురు గాని, సావకాశంగా వింటాము.. అయితే మేము మీకు ఇచ్చిన మాట తప్పమని వేరే హామీ ఇవ్వనవసరం లేదనుకుంటాము!" అని రఘోబా వారిని సాగనంపాడు.

'దోరాబ్జీకి ముఖ్యమంత్రి పదవీ, కేశోపంత్‌కి ప్రధానన్యాయమూర్తి పదవీ ఖాయమన్నమాట', అనుకున్నారు సభాసదులలో కొందరు అభిజ్ఞులు.

దోరాబ్జీ, కేశోపంత్‌ల నిష్క్రమణం తర్వాత రఘోబా ముఖ వైఖరి పూర్తిగా మారిపోయింది. నవ్వు కాస్తా మాయమై కోపం కనిపించింది.

"కార్భారీ, ఏరీ వేగులవాళ్ళు! ఇంత ఆలస్యమేమిటి?" అని అరిచాడు.

"చిత్తం! ఇక్కడే ఉన్నారు..." అని తడబడుతూ సమాధానం ఇచ్చాడు కార్భారీ.

"ఉంటే ఇంత సేపేం చేస్తున్నావు? తీసుకురా మా ముందుకి?"

గూఢచారు లిద్దరూ వచ్చి రఘోబా ముందు నిలబడ్డారు. వారి వాలకం చూస్తే తమ సందేశాన్ని చెప్పటానికి భయపడుతున్నట్టున్నారు.

"వూ! మాట్లాడరేం?" అని గర్జించాడు రఘోబా. వాళ్లిద్దరూ అక్కడ కూర్చున్న వారిని కలయచూశారు.

— "అందరూ మనవాళ్లే! సందేహించకుండా చెప్పండి!!" అన్నాడు రఘోబా చిరాకుగా.

"ప్రభువు వారి అజ్ఞ! పూనాలో సాన్ లూయీ అనే ఫ్రెంచి దుర్మార్గు డొకడు తమరికి ఎదురుగా ప్రచారం చేస్తున్నాడు! ఇవాళే తన దేశం ప్రభుత్వం వద్ద నుంచి నానాఫడ్నవీస్‌కి సహాయం ఇచ్చే హామీ తెచ్చాడని విన్నాము. ఇంగ్లీషువారు యుద్ధంలో దిగితే ఫ్రెంచి సేన తప్పకుండా నానాఫడ్నవీస్‌కి సహాయం చేస్తుందిట.." అన్నాడు ఒక వేగివాడు.

"రెండువేల మంది సైనికులు ఫ్రాన్సు నుంచి వచ్చారుట ప్రభూ! అంతేకాక నానా ఫడ్నవీస్ సేనని ఐరోపా పద్ధతుల మీద తర్ఫీదు చేస్తారుట." అని చెప్పాడు రెండవ గూఢచారి.

అసలే చిరాకుగా ఉన్న రఘోబా రెచ్చిపోయాడు. ఫ్రెంచివారిని కసిదీరా తిట్టాడు.

"ఆ వెధవ ఫ్రెంచివాడు మమ్మల్నేమి చేస్తాడో చూద్దాము! బ్రిటిష్ బలమంతా మన వైపేగా!" అని చివరికి సరిపుచ్చుకున్నాడు.

"ప్రభువులు క్షమించాలి! ఇంకా చెప్పవలసింది ఉంది.—ఈ ఫ్రెంచి దుర్మార్గుడు మరొక నీచానికి దిగాడు."

"ఏమిటది?"అని అరిచాడు రఘోబాలతని మాటపూర్తికాకుండానే. "ఏమిటానీచం?"

"ఆ దుర్మార్గుడు సాన్‌లూయీ ఫ్రాన్సు దేశం చిత్రకారు డొకడి చేత ఒక పటం వేయించాడుట...దానిని పూనాలో అందరికీ చూపిస్తున్నాడుట! అది ఎందరిలోనో సంచలనం లేవదీసింది.."

"ఏమిటీ వాగుడు! ఆ పటానికీ మాకు సంబంధం ఏమిటి? బొమ్మలూ, పటాలూ చూపించి యుద్ధాలు గెలుస్తారా ఏమిటి?!"

"అదొక సామాన్య చిత్రపటం కాదు ప్రభూ! అది చాలా ఘోరంగా ఉంది..." గూఢచారి ఇక చెప్పటానికి సందేహించాడు.

"ఘోరమా?"

"అవును! అతిఘో [illegible] దులో మనుష్యులంతా నిజమైన మనుష్యులంత ఉన్నారు. అందులో.. అందులో...అది ఒక హత్యాదృశ్యం! నిద్రపోయిన నారాయణరావుని ఖరగ్‌సింగ్ పొట్టలో పొడుస్తున్నాడు.— వెనక నుంచున్న సుమేర్‌సింగ్ నారాయణరావు భుజంమీద వేటువేస్తున్నాడు! ఇంకా..! ఇంకా..:' అని ఇక చెప్పలేక పోయాడు గూఢచారి. ఈసారి రఘోబా కూడా మాట్లాడలేకపోయాడు! కుతూహలంతో, భయంతో గూఢచారి వైపు చూస్తూ ఉండిపోయాడు.

ఆ చిత్రంలోనే ప్రభువువారు కూడా ఉన్నారు! వారి ముఖంలో సంతోషం, సంతృప్తి కనిపించేట్లు చిత్రించాడు చిత్రకారడు! ప్రభువులు నన్ను కరుణించాలి. ఉన్నదున్నట్లుగా తమరికి చెప్తున్నాను. సాన్‌లూయీస్ ఆ బొమ్మని తన గుడారంలో బహిరంగంగా ప్రదర్శిస్తున్నాడు. అనుదినమూ వేలాది వేలు పటాన్ని చూసిపోవటానికి వస్తున్నారు! ఎందరో కన్నీటితో వెనక్కి వెళ్లిపోతున్నారు.. వారి వాఖ్యానాలు వింటే వళ్లు జలదరిస్తుంది!'



# రామశాస్త్రి

“ఏమయ్యారు?” అని అడిగాడు రఘోబా హీనస్వరంతో.

“ఆ మాటలని నేను ఉచ్చరించగలనా? నా నాలుక తెగిపోదూ?!”

“హా! ఇంతదాకా ఈ ఐరోపా దౌర్భాగ్యులు మనని తమ తుపాకులతో బాధించారు! ఇప్పుడీ రకం బాధ కూడా ప్రారంభించారన్నమాట.. నానాఫడ్నవీస్ పక్షం వహించినా మా కింత కోపం రాదు! ఈ విశ్వాసఘాతుకానికి వాళ్ళని ... ప్రదర్శనని మేమెన్నడూ క్షమించలేము! క్షమించము..” రఘోబా ఉగ్రుడయి పోయాడు. “ఈ నీచమైన కార్యానికి వారిని ఈ దేశం నుంచే తరిమి వేస్తాను!.. సరే, తులాజీ సంగతేమిటి?”

తులాజీ రఘోబాతో వచ్చి ఉండటానికి ఇంగ్లీషు అధికారులు అంగీకరించలేదు. సామాన్యులయిన హంతకులకి శరణు ఇవ్వలేమన్నారు. అందుచేత తులాజీ నైజామ్ రాజ్యంలోనూ, అతని అనుచరులు సుమేర్ సింగ్, ఖరగ్ సింగ్‌లు పోర్చుగీసు వారి అధీనంలో ఉన్న గోవాలోనూ దాక్కున్నారు. కారంటే ప్రీతికల రఘోబా ఎప్పటికప్పుడు వారి సమాచారం కనుక్కుంటూ ఉండేవాడు.

వారి వద్ద నుంచి వచ్చిన వేగుల వాళ్ళిద్దరూ ముందుకు వచ్చారు.

“ఊ, చెప్పండి!” అని అరిచాడు రఘోబా.

“ప్రభూ! తులాజీ హైదరాబాద్‌లో లేడు!”

“ప్రభూ ఖరగ్‌సింగ్, సుమేర్‌సింగ్‌లు గోవాలో లేరు!”

“ఏమయ్యారు?” రఘోబా గొంతు కోపంతో వీరపోయింది.

“నానాఫడ్నవీస్ నైజామ్‌ని ఒదిరించి తులాజీని చేజిక్కించుకున్నాడుట!”

“సుమేర్‌సింగ్, ఖరగ్‌సింగ్‌ల విషయం మాత్రం అంత తేలికగా జరగలేదు ప్రభూ! ‘దాద్రా’ ప్రాంతాన్ని పోర్చుగీసు వారికి ఇచ్చి వీరిని చేజిక్కించుకున్నాడు!”

“ఆ! ఆ నైజామ్, పోర్చుగీసు వారు కూడా ఫడ్నవీస్ ఉపాయాలకి లొంగిపోయారన్నమాట.. ఎంత దారుణం! ముగ్గురినీ ఆ ఫడ్నవీస్ పురందర్ కోటలో దాచి ఉంటాడు..” అని రఘోబా వాపోయాడు.

“లేదు ప్రభూ! వారు పురందర్‌లో లేరు.. పూనాలో శిరచ్ఛేదం చేయించాడు నానాఫడ్నవీస్! అంతటితో ఆగక ఛిన్న శిరస్సులని ఈటెలకి గుచ్చి నగరం అంతా పూరేగింప చేశాడు... చివరికి వాటిని నక్కలకీ, గద్దలకీ వేయించాడు!”

“భగవంతుడా, ఏమిటిది! ముగ్గురూ నానాఫడ్నవీస్ కసికి ఆహుతి అయ్యారా?!..” రఘోబాకి ఈ ముగ్గురూ అంటే నిజంగానే ఇష్టం. అప్రయత్నంగా కళ్ళు తుడుచుకున్నాడు.

ఇంతలో ఒక దూత అవసర అవసరంగా అక్కడికి వచ్చి కార్వారీ చెవిలో ఏదో చెప్పాడు.

“ప్రభూ! బయట ‘సందిసీస్వర్’ ఒకడు వచ్చి ఉన్నాడు, రమ్మని సెలవా?” అని రఘోబాని ఉద్దేశించి అడిగాడు కార్వారీ. (సందిసీస్వర్ అంటే ఒంటెమీద సవారీ చేసేవాడు.) అతనేదయినా మంచి వార్త తీసుకువచ్చి ఉండవచ్చుననే ఆశ కార్వారీలో మొలకెత్తింది. ఆశ అతని కంఠస్వరంలో ప్రతిధ్వనించింది. అది రఘోబాకి ఒకవిధంగా ఉపశమనం కలిగించింది.

“లోపలికి తీసుకురండి!”

సందిసీస్వర్ నేరుగా రఘోబా వద్దకి వచ్చి అతని కాళ్ళ మీద పడ్డాడు.

“ప్రభువుల వారు ఈ దీనుడిని క్షమించాలి! దుర్వార్త తీసుకు వచ్చినందుకు మన్నించాలి!” అన్నాడు.

“ఏమిటీ! మళ్ళీ దుర్వార్త!” అన్నారు కొందరు.

“ఈరోజు విన్న దుర్వార్తలు చాలవా?” రఘోబా తనని తనే ప్రశ్నించుకున్నట్లు అన్నాడు. అప్పటికి కొంచెం ధైర్యం తెచ్చుకున్న వేగివాడు, “ప్రభూ రామశాస్త్రి తిరిగి ప్రధానన్యాయమూర్తి పదవి పుచ్చుకుంటున్నాడు! అతన్ని ఒక మారుమూల గ్రామం నుంచి వెతికి తీసుకు వచ్చింది నానాఫడ్నవీస్, సఖారామ్ బాపూలే! ఈపాటికి ఆయన పదవీ స్వీకారం కూడా చేసి ఉండవచ్చు..”

“ఆ! ఆ రాక్షసుడు రామశాస్త్రి తిరిగి వచ్చాడా? ఇక నేను సాధించేది మాత్రం ఏమి ఉంటుంది గనుక!”

“ప్రభూ, విచారించకండి.. మన వకీళ్ళు విలాయత్‌కి వెళ్ళి బర్క్ వంటి పెద్ద మనుష్యుల ఆమోదం పొంది వచ్చారు కదా..” అని రఘోబాని సముదాయించబోయాడు కార్వారీ.

“..వెర్రివాడా! బర్క్ ఆమోదం రామశాస్త్రి కీర్తికే మాత్రం సాటి! ఈ మరాఠా సామ్రాజ్యంలో రామశాస్త్రి మాటంటేనే ఎంత గౌరవం ఉందో నీకు తెలుసా? ఇక నాగతి ఏమిటి?!” రఘోబాపూర్తిగా నిస్పృహకి లోనయ్యాడు. పిచ్చివాడివలె జుట్టు పీక్కున్నాడు. హారాలు తెంపుకుని విసిరి వేశాడు. చివరికి ఇక పట్టలేక ఒక పెద్ద అరుపు అరిచి నేల మీదకి కూలిపోయాడు.

(సశేషం)



# మీ జుత్తును ఆరోగ్యంగా నిగనిగ లాడేలాగు వుంచుతుంది

# బ్రిల్‌క్రీమ్

సర్వోత్తమ హేర్-డ్రెస్సింగ్




కేవలం బ్రిల్‌క్రీమ్ మాత్రమే

- చక్కగా జుత్తు దువ్వుకోవడానికి సాయపడుతుంది. జుత్తు జిడ్డు కాదు. చెదరి పోదు.
- చాలా పొదుపు అయినది. ఒక్కసారి రాస్తే చాలు రోజంతా జుత్తు రేగదు.
- దీనిలో చేర్చిన అద్వితీయమైన మిశ్రమము మాడును పోషించి, జుత్తును బాగా పెంచుతుంది.
- మీ జుత్తు యొక్క సహజ రంగును బయటు పరచును.

**మీరు కూడా బ్రిల్‌క్రీమ్ ఉపయోగించడం మొదలు పెట్టండి**

**ప్రపంచమంతటా లక్షలాది మంది సొగసుకారులు ఉపయోగించేది.**




...కంటే జబ్బుకి ఎంత ఇచ్చినా భర్త జేబులు వెయ్యి వెతికితేగాని తృప్తిగా ఉండదు ఆడ వాళ్ళకి. "నా జేబులోంచి ఏమైనా తీశావా?" అని ఆయనగారు అడగటం "చిల్లర కావలసి తీశానండీ" అని నిజమైన అబద్ధం ఒకటి ఈవిడగారు చెప్పడం అదొక సరదా, అలవాటు! పోనీ ఒక జబ్బు!

ఈ జబ్బుకి అతీతంగా లేదు పార్వతి ఆరోగ్యం. రోజూలాగే ఉదయంపూట కృష్ణమూర్తి బట్టల జేబులో చేయి పెట్టింది పార్వతి. పర్సు పైకి తీసింది. తీసిన మనిషి అలవాటుగా పర్సు తెరిచి ఎదురుగా ఉండే తన ఫోటోకేసి చూడబోయింది. చూస్తుండగే అలాగే బొమ్మలాగా ఉండిపోయింది. అక్కడ తన ఫోటో లేదు. సరికదా, కనీసం కృష్ణమూర్తి విజిటింగు కార్డు ఉన్నా ఏమైపోయేదోగాని అందంగా నవ్వుతూ ఉన్న ఒక అమ్మాయి బొమ్మ ఉంది. ఆశ్చర్యం, విషాదం అలముకొన్న పార్వతి ముఖం క్షణంలో సగంలో రంగులు మారుస్తోంది. అందంగా నవ్వుతూన్న అమ్మాయి ముఖం తనకేసి చూస్తున్నట్టుంది. "కృష్ణమూర్తి నా ఫోటో ఏం చేశాడు? ఈ అమ్మాయి బొమ్మ ఇక్కడేం చేస్తోంది?" ప్రశ్నించుకుంది పార్వతి..

కలిగిన ఆశ్చర్యం షాక్‌గా తయారైంది పార్వతికి. ఇన్ని సంవత్సరాల వివాహంలోనూ అందమైన అమ్మాయిలు ఎదురైతే చూడకుండా కళ్ళు మూసుకోలేదు కృష్ణమూర్తి. కాని వ్యక్తిగతంగా వాటితో సంబంధబాంధవ్యాలు ఏర్పడలేదు అతనికి. అందాన్ని చూడడం, వ్యాఖ్యానించడం అతని హాబీ. అందుకే అంతగా పట్టించుకోలేదు పార్వతి. బాధ పడలేదు. అడపాదడపా అతని ఉత్ప్రేక్షలు ఆమెలో అసూయను రేకెత్తించక పోలేదు. కాని అలా అందాన్ని మెచ్చుకోవడం అన్నది అందమైన, ఆరోగ్యవంతమైన మగవాడు చేయవలసిన పనిగా తోచిందామెకి. "కృష్ణమూర్తి లాంటి వాళ్ళు గుడ్డిగా పూరుకున్నా బాగుండదు" అని పార్వతి నమ్మింది.

కృష్ణమూర్తి తనని మోసం చేస్తాడని గాని, తనని కాదని తప్పుదారి తొక్కుతాడని గాని ఆమె ఎప్పుడూ అనుకోలేదు. అయితేనేం గాక! పరాయి స్త్రీ బొమ్మకి అతని పర్సులో స్థానం ఏర్పడింది. "నాకు తెలిసి నాకు తప్ప ఇంకో స్త్రీకి అతని జీవితంలో

"ఫోటో తీసుకున్నాను" అని పాపాయిది ఆ అమ్మాయి బొమ్మ చూస్తూ.

"కొన్నిరోజుల వరకు వేడిపోయి ఉండ వచ్చు, కాని దాని స్థానే ప్రేమా, నమ్మకం విశ్వాసం పెంపొందాయి కదా? లేక పెంపొందాయని భ్రమపడ్డానా?" అనుకుంది. ఎటు నుంచి ఎటు ఆలోచించాలో అర్థంకాలేదు పార్వతికి.

గోడకున్న అద్దంలో తన ప్రతిబింబం చూసి అదరకొట్టింది పార్వతిని. అలసిన కళ్ళు, రేగిన జుట్టు, వెలిసిపోయిన చీర, అద్దంలో తన బొమ్మని పర్సులో అమ్మాయి బొమ్మని మార్చిమార్చి చూసింది పార్వతి. దుఃఖం, కోపం వెల్లువికి వచ్చాయి. కోపంతో పర్సులో ఉన్న బొమ్మను తీసి చిన్నచిన్న ముక్కలుగా చింపి పారేసింది. ఫోటో ఆల్బం లోంచి తనూ పిల్లలూ ఉన్న బొమ్మ ఒకటి తీసి పర్సులో పెట్టింది. 'అద్దం నన్ను చూసి హేళన చేస్తూంది' అనుకుంది. "నేనేమిటి? మామూలు పెళ్ళాన్ని! ఇల్లాలిని! బ్రతుకులో యింటి గోడలు తప్పించి వేరే లేనిదాన్ని, పిల్లల అవసరాలూ, భర్త అవసరాలూ తప్పించి మిగిలిన ప్రపంచం తెలియని దాన్ని! చాలీ చాలని డబ్బు, ఎప్పుడూ చాలీ చాలనివాలనే తాపత్రయం తోనే నా పొద్దు గడిపే దాన్ని!" అనుకుంది పార్వతి.

అప్పుడప్పుడు కృష్ణమూర్తి అంటూనే ఉంటాడు 'నీకు ఇల్లూ పిల్లలూ తప్పించి వేరే గొడవే లేదని. 'లేదని చెప్తాను' అను కుని పర్సు యథాస్థానంలో పెట్టి ఇంటి పనిలో ప్రవేశించింది పార్వతి. ఏంచెప్తాను? ఏం చేయను? అన్న ప్రశ్నలు వేస్తూన్న ప్రతిపనిలోనూ కనిపించి ప్రాణం విసిగించాయి. "ఆ ఫోటో ఎవరిది?" అని అడిగితే ఏమవుతుంది?

వంటింట్లో మోడా మీద కూర్చుని ఆలోచనలో పడిన పార్వతికి వాసిగాడూ, బాబిగాడూ కలిసి పళ్ళపొడి కోసం చేస్తున్న యుద్ధం వినిపించనూలేదు కనీసం కను పించనూ లేదు! 'నెలమధ్యలో కృష్ణమూర్తి పర్సులోకి అంత డబ్బెలా వచ్చింది చెప్మా?' అన్న ఆలోచన వచ్చింది. పర్సులో డబ్బు లెక్కపెట్టలేదు పార్వతి. కాని అది మామూలు కంటే ఎక్కువ బరువే ఉన్నట్టు జ్ఞాపకం వచ్చింది. "నాతో మాట వరస కైనా అనకుండా అంత డబ్బు ఎప్పుడు తీసి ఉంటాడు కృష్ణమూర్తి?" అనుకుంది.

"చిన్నచిన్న కర్చుకి సహితం వెనుకాడేవాడు? అలాంటిది తన జల్సాల కింత డబ్బు తగ లేస్తాడా?" అనుకుని లేచింది పార్వతి. మళ్ళీ పడకగదిలోకి వెళ్ళింది. మంచం మీద కృష్ణమూర్తి అటునుంచి ఇటు తిరిగి పడుకున్నట్టుంది. వెనుక పక్కగా వెళ్ళి జుబ్బా జేబులోంచి పర్సు తీసింది. లెక్క పెట్టి ఐదు పదిరూపాయల కాగితాలు తీసుకుంది. పర్సు జేబులోనూ, డబ్బు చీరల మడతలలోనూ పెట్టేసి తిరిగి వంటిం ట్లోకి వచ్చింది పార్వతి.

పొంగు వస్తున్నాయి పాలు. పిడ్డంగా దగ్గరే నించుని పొంగు చూస్తూంది పార్వతి. "ఇలాంటి భర్తలని ఉట్టినే వదిలేయ కూడదు. నేనూ చూస్తాను. నా కింత అన్యాయం తలపెడతాడా?" చూస్తూ ఉండ గానే పాలు పొంగిపోయాయి. 'అయ్యో' అనుకుని గబగబ గిన్నె కిందకి దింపింది.

కృష్ణమూర్తి తొమ్మిది దాటే వరకు లేవడు. లేచిన అరగంటలో ఆఫీసుకి బయలుదేరి పోతాడు. ఈలోగానే తనేం చేయాలో నిశ్చయించుకుంది పార్వతి. ముందుగదిలోనున్నఫోను దగ్గరకి వెళ్ళింది. తల్లిగారింటిపక్క వాటా వాళ్ళకి ఫోనుంది. అక్కడికే సాధారణంగా ఫోను చేస్తుంది, పార్వతి. నెమ్మదిగా ఫోను చేసింది. ఓ రెండు నిముషాలలోనే తల్లి గొంతు ఫోనులో వినిపించింది. ఒక పక్క ప్రాణం లేచి వచ్చింది, ఒకపక్క దుఃఖం పొంగి వచ్చింది పార్వతికి.

"ఏమ్మా ఇంత పొద్దున్నే ఫోను చేశావు? పిల్లలకి ఒంట్లో బాగులేదా?" ఆత్రుతతో అడిగింది పార్వతి తల్లి.

"బాగానే ఉందమ్మా, ఈరోజు సాయింత్రం అతనూ నేనూ బయటికి వెడదామని. పిల్లలని నీ దగ్గర పొద్దున్నే దింపేస్తారు సరేనా? రాత్రి వచ్చేసరికి ఏడు అయిపోతుంది. పొద్దుటే వస్తాను.' అంది పార్వతి.

"అలాగే దింపేయమను. అయినా శనాది వారాలేకదా రెండుపూటలుఉంటారు. రెండు జతల బట్టలిచ్చి పంపు' అంది పార్వతి తల్లి.

"పెళ్ళి చేసుకునేదాకానే, తరువాత ఆ వివాహం సవ్యంగా ఉండాలంటే ఆడదాని చేతిలోనే ఉంది. గాజు గుళికలాంటి కాపురం విరిగిపోయినా ఆడదానిదే తప్పు. ఎటు నుంచి ఎటువచ్చినా ఫలితాలు అనుభవించ వలసినదీ ఆడదే' అన్న నీతి పెళ్ళికి తొలి రోజే చెప్పింది పార్వతి తల్లి.

"కొంపలు కూల్చే సంగతాని [illegible] ఈ డబ్బు ఖర్చు చేయనిస్తానా?" అను కుంది పార్వతి.

తొమ్మిదింటికల్లా కాఫీ కప్పుతో కృష్ణ మూర్తి పక్క ప్రత్యక్షం అయింది పార్వతి. "టైము పది దాటుతూంది" అంటూ లేపింది.

కళ్ళు తెరుస్తూనే భార్య అందమైన ముఖంచూసి కన్నుగీటాడు కృష్ణమూర్తి.

"ఎంత మోసకారి! ఎంత నాటకం ఆడు తున్నాడు!" అనుకుంది పార్వతి.

"పిల్లలు లేచారా?" ఇల్లు నిశ్శ బ్దంగా ఉన్నట్టు తోచి అడిగాడు కాఫీకప్పు అందుకుంటూ.

'కోడి కూయడం మరిచిపోవచ్చుగాని నా కొడుకులు టైము తప్పరు' అంది పార్వతి.

"మరయితే గోల వినబడదేం?" అడి గాడు.

"పొద్దుటే నుంచి వాళ్ళం చేస్తున్నా పట్టించుకోలేదు. నాకు ఒంట్లో బాగుండ లేదు." మంచం అంచున కూర్చుంటూ అంది.

"పోనీ మీ అమ్మగారిని రమ్మనలేక పోయావా?" పార్వతి చేయి తన చేతిలోకి తీసుకుని వేళ్ళు లెక్కపెట్టడం ప్రారం భించాడు. అది అతని అలవాటు. భార్య పట్ల సానుభూతి చూపెట్టే పద్ధతి. "ఆఫీసు పనంతా ఆ టైములోనే ఆలోచిస్తుం టాను." అంటాడు.

"పెళ్ళానే అక్కడ దింపమంది. శని ఆది వారాలు అక్కడే ఉంటారంది" నిజమైన సంగతిలా అంది పార్వతి.

"గుడ్. మరో సంగతి చెప్పనేం? ఆఫీసుకి వెడుతూ పిల్లలని దింపేసి వెడతాను. నువ్వేమో సాయంత్రం రడీగా ఉండు. ఎక్కడికేనా వెడదాం" భార్యని అమాంతం కౌగలించుకున్నాడు కృష్ణమూర్తి.

"మాట పొల్లుపోనివ్వడు. ఎంత జాగ్రత్త మనిషో" అనుకుంది పార్వతి.

"నా వంట్లో బాగులేదని కదూ వాళ్ళని అమ్మమ్మ దగ్గరకి పంపించడం?" కటువు గానే అంది.

"ఐసీ! మరిచేపోయాను. పోనీలే ఎవరినేనా స్నేహితులని పిలుద్దాం. ఇంట్లోనే సరదాగా కాలక్షేపం చేయవచ్చు." అన్నాడు ఒళ్ళు విరుచుకుని లేస్తూ.

"బాగుంది వరస. నేనా కాఫీ కప్పులన్నీ

"పోనీ మనిద్దరమే వెచ్చగా కూర్చుం దాం." భార్య చెంపపై ఓక్షణం తనచెంప ఆన్చి బాత్ రూములోకి దారి తీశాడు కృష్ణమూర్తి.

"ఏం మనిషి?" అనుకుంది పార్వతి.

పిల్లలిద్దరికి చిన్న బాగ్ లో రెండు జతల బట్టలు సర్దింది. వాళ్ళ అమ్మమ్మ దగ్గరికి వెళ్లడానికి చూపుతున్న ఆత్రం చూసి, ఆశ్చర్యపడింది. కృష్ణమూర్తి అరగంటలో తెమిలి ఆఫీసుకి సిద్ధం అయాడు. పిల్లల్ని ఎక్కించుకుని బయలుదేరాడు. కారు స్టార్టు చేయబోతూ 'నే త్వరగా వచ్చే స్తాను' అని హెచ్చరించాడు పార్వతిని.

భర్తా పిల్లలూ అటువెళ్లగానే ఇంటి పనిలో మునిగింది పార్వతి. పని ముగించి స్నానం చేసి శుభ్రమైన చీర కట్టుకుని బజారుకి బయలుదేరింది. ఏభయి రూపా యలూ పార్వతిని నిలువనీయడంలేదు. చక్కని జరీ చీర కొనుక్కుంది. దానికి తగ్గ జాకెట్టు బట్ట కొంది. ఇంటికి తిరిగి వచ్చి భోజనం ముగించింది. తరవాత బోయిలర్ అంటించి ఓ అరగంట నిద్రపోయింది. మధ్యాహ్నం లేచి తలంటుకుంది. నూకా లుతో చెప్పి మల్లెపూలు తెప్పించుకుని చక్కని దండ కట్టుకుంది.. సాయం త్రానికి కృష్ణమూర్తి కిష్టమైన కాకర కాయ కూర కూడా వండింది!

రోజూ సాయంత్రం ఏడుగంటల ప్రాం తాల ఇంటికివచ్చే కృష్ణమూర్తి ఐదున్నర కల్లా తలుపు తట్టాడు ఎదురు చూడ కుండా లభ్యం అయింది భార్యతో ఏకాం తం. ఆ అవకాశం అతనిలో కొత్త ఉత్సా హం రేకెత్తించింది. వీధి తలుపు తెరచిన పార్వతిని చూసి వెన్నెలలా వికసించిందతని ముఖం. "ఓయ్! ఏమిటి సంగతి?"అన్నాడు కాలితో తలుపు మూస్తూ పార్వతిని తన చేతుల్లోకి తీసుకుంటూ.

"ఏంలేదే!"అమాయకంగా అంది పార్వతి.

"ఎవరేనా వస్తున్నారా?" సాంబ్రాణి వాసనలు వెదజల్లుతూన్న పార్వతి జుట్టు వాసన చూస్తూ అడిగాడు.

"లేదే" అంది.

'మరేమిటి దంతా, నా కోసమే!' నమ్మ లేనట్టు అన్నాడు.

'అనుకో' అంటూ అతని చేతుల్లోనుంచి తప్పించుకుని కాఫీ కోసం లోపలికి నడచింది పార్వతి

# జేబులో బొమ్మ

కాఫీ కప్పు అందిస్తూ ఉంటే చూశాడు కొత్తచీర! పార్వతి మీద నుంచి కళ్ళు మళ్లించుకోలేకుండా ఉన్నాడు.

వెళ్లిపోతున్న పార్వతిని 'ఏయ్ యిలారా' ముద్దుగా పిలిచాడు.

"నేనేం గేదెనా? అవునా?" అంది.

"లేదు నా బానిసవి! ఇలారా" చెయ్యి పట్టుకున్నాడు. కొంటెగా ఆమె ముఖం లోకి చూస్తూ "పోనీ వద్దంటే చెప్పు నీ స్వేచ్ఛ కొనుక్కుంటావా?" అడిగాడు.

"ఫోబ్బా! ఏమిటా మాటలు? నీ బాని సగా ఉండాలనేగా నా కోరిక" అంది పార్వతి.

'సరేగాని ఇలా వచ్చి కూచో' మంచం మీద తన పక్క స్థలం చూపించాడు కృష్ణ మూర్తి.

ముద్దుగా కూర్చుంది పార్వతి.

"చీర ఎప్పుడు కొన్నావు? నేను చూడనే లేదే?" పాము కుబుసంలాగా ఉన్న చీర కొంగులో ముఖం దాచుకుంటూ అడిగాడు.

'కొత్తది' ముక్తసరిగా సమాధానం చెప్పింది పార్వతి.

"డబ్బెక్కడిదీ? ఇబ్బందిగా ఉంది అనుకున్నాం కదా?" అడిగాడు.

"ఇబ్బందిగా ఉందని నేను అనుకున్నాను. నువ్వేం అనుకున్నావు?" అతని కేసి సూటిగా చూస్తూ అడిగింది పార్వతి.

"నా దగ్గిర డబ్బు లేదని నీకు తెలి యదా ఏం? అందుకేగా సాయంత్రం లేటు యినా అప్పుడప్పుడు ఓవర్ టైము కూడా చేస్తున్నాను."

'ఎంత గట్టివాడు! పాత కథే ఎంత నమ్మేలా చెప్తున్నాడు! ఏం చేటగాని నేను నమ్మకేం చేస్తానని! కానీ' అనుకుంది పార్వతి.

"పోనీలే డబ్బుంటే ఏం, లేకుంటే ఏం. ఈ రోజు నువ్వు రంభ లాగా ఉన్నావు" మెల్లిగా జరిగి పార్వతి ఒడిలో తలపెట్టు కున్నాడు కృష్ణమూర్తి.

"పోనీలే. ఆ మాత్రమేనా అనగలిగావు" కోపాన్ని అణచుకొంటూ అంది పార్వతి.

"ఈ రోజెందుకిలా ఉన్నావు?" నడుం మీద చేయి వేసి దగ్గిరకి లాక్కుంటూ అడిగాడు. 'కోపం కూడా వచ్చినట్టుంది. నువ్వెంత దాచుకున్నా నీ కోపం దాగదని తెలుసా పార్వతీ" మొండిజాతి! ఈ నవ్వు ముఖం వెనకాల మోసాలు చేసే అసలు ముఖం ఉంటుందంటే కూడా ఎవ్వరూ నమ్మరు. ఏమనుకుని ఏం లాభం, అనుకుంటూ ఏమో అతని కౌగిట ఒదిగింది పార్వతి. పార్వతి ముఖాన్ని దగ్గిరకి తీసుకుని పెద వుల మీద సున్నితంగా ముద్దు పెట్టు కున్నాడు. ఆశ్చర్యం! పార్వతి తిరిగి ముద్దు పెట్టుకుంది. ఆవేశంగా ఆమెని గట్టిగా పొదివి పట్టుకున్నాడు. 'పారూ ఎన్నాళ్ళ యింది నువ్విలా నా దగ్గిరగా ఉండి?" అతని గొంతుకలో సున్నితమైన మొరటు స్వరం ప్రవేశించింది. కళ్ళు వింతగా వెలుగ తున్నాయి. ఆ సమయం అందించిన సత్ఫలి తాలని అందుకునే లోగానే హాల్లో ఫోను మ్రోగింది. పార్వతి లేచింది.

"నువ్వుండు. నే వెడతాలే." అంటూ లేచాడు కృష్ణమూర్తి. మంచం మీద బొమ్మలా కూర్చుంది పార్వతి.

హాల్లోంచి కృష్ణమూర్తి చెప్తున్నవి కొంచెం కొంచెం వినిపిస్తున్నాయి. "..ఉం దోయ్.. క్లబ్బులో నీ కుర్చీలో పడి ఉంది. ఈ రోజు ఆఫీసుకి తెద్దామనుకుని మరిచి పోయాను. రేపు ఉదయం తెస్తాలే."అంటూ ఫోను పెట్టేసి వస్తున్న కృష్ణమూర్తిని కన్నార్పకుండా చూస్తూంది పార్వతి.

'పెళ్లిలో కూడా నువ్విలాగే చూశావు నాకేసి' అంటూ వచ్చి మంచం మీద కూర్చున్నాడు "రాధాయి ఫోను. నిన్న క్లబ్బులో కుర్చీలో పర్సు పారేసిపోయాడు. ఈరోజంతా దాని కోసం వెతికాడుట. చూడు. రేపు ఆఫీసుకి వెళ్ళేముందు నిన్నటి జుబ్బా జేబులో పర్సు జ్ఞాపకం చెయ్యి... మంచి సమయంలో చేశాడు వెధవ ఫోను.. రా పారూ' దగ్గిరకి తీసుకున్నాడు కృష్ణ మూర్తి.

పర్సు..డబ్బు..బొమ్మ.. ఇవే మాటలు శూలాల్లాగా పొడుస్తున్నాయి పార్వతిని. భయంతో భర్త ముఖంలోకి చూసింది. అచేతనంగా ఉండిపోయిన పార్వతిని తనకేసి తిప్పుకున్నాడు కృష్ణమూర్తి. ముఖం ఎత్తి అతని కేసి చూడలేక అతని గుండెల్లో దాచేసుకుంది. అంత సేపూ అంత గంభీరంగా ఉన్న పార్వతి ఇలా ఎందుకైందో అర్థం కాలేదు కృష్ణమూర్తికి.

"ఏమైంది పారూ ఒంట్లో నిజంగానే బాగులేదా?" ఆత్రంగా అడిగాడు.

"లేదు లేదు, వంట్లో బాగానే ఉంది

# అరుణోదయం




అరుంధతి పుట్టగానే 'నీకు పెళ్ళాం పుట్టిందిరా' అన్నప్పుడే ఆ మూడుముళ్ళూ వేయించి వున్నట్లయితే ఈనాడు ఎవరికీ—ముఖ్యంగా రాజశేఖరానికి—ఇంత ఆత్మక్షోభ వుండేదికాదు!

* * *

సరిగ్గా పంధొమ్మిది సంవత్సరాల తరువాత—

ఓ వానరోజు సాయంత్రం ఆరుగంటల సమయంలో—

ఇంటి మెత్తంమీద రాజశేఖరం అరుంధతి—ఒంటరిగా వున్నప్పుడు—

"బావా! నీ ఉద్దేశ్యం నాకేమీ అర్థం కావటంలేదు! ఈ అరుంధతే నీకు భార్యగా కావాలనుకుంటే నేను అభ్యంతరం చెప్పే జీవితం లేదు.. అలాగే కానీయ్! నా శవానికి మూడు ముళ్ళూ వేయ్... నీకోరిక తీర్చుకో. అరుంధతి నీ పెళ్ళామని నలుగురికీ చెప్పుకో!..కాని, అది నా గొంతులో ప్రాణముండగా జరిగే పని మాత్రం కాదని గుర్తుంచుకో!...ఎందుకు బావా లేనిపోని ఆశలు పెట్టుకుంటావ్?.. ఎమ్మే చదివావ్.. కావాల్సిన దానికన్నా ఎక్కువే లోకజ్ఞానం పొంది వుంటావ్!. కాని ఇష్టంలేని ఆడదాన్ని ఎన్నాళ్ళు భార్యగా ఉంచుకోగలుగుతావ్?.. నీ జీవితాన్ని నరకం చేసుకోనటమే గాకుండా మరొకరి జీవితాన్ని గూడా ఎందుకు నాశనం చేస్తావ్?

ఒక్కక్షణం ప్రశాంతత ఆవరించింది.

"..నీ కంటే నాకు జాలి వున్నది... నీ మీద నాకు అభిమానమున్నది... కాని నిన్ను భర్తగా ఊహించుకునే విశాలహృదయం మాత్రం నాకు లేదు బావా!...నీవే మనుకున్నాసరే!... అంతేగాదు.. నీకు చివరిసారిగా చెపుతున్నాను.. అరుంధతి నీ భార్యగా జీవితం గడుపుతుందని.."

"అరూ!..." పెద్దగా అరిచాడు రాజశేఖరం. "నా ముందు నుంచి వెళ్ళిపో అరుంధతీ!.. వెళ్ళిపో!"

అలా అరవనయితే అరిచాడుగాని, అతడి మాట మీద అతడే నిలబడలేకపోయాడు. అర్ధరాత్రి పన్నెండుగంటలప్పుడు—ప్రశాంతతతో పరిసరాలు ఊడదచుట్టుకు పడుకున్నప్పుడు - నిశ్శబ్దంగ అడుగులో అడుగు వేసుకుంటూ, ఆ గృహం నుండి బయట పడ్డాడు. నల్లటి దుప్పటిలాంటి చీకటిలో కలిసిపోయాడు.

అతడు ఎంత చిన్నగా నడవటానికి ప్రయత్నిస్తేనేం? - ఎడంకాలు స్థానంలో వున్న కర్రకాలు గుండెలవిసేలా శబ్దం చేయనే చేసింది!

* * *

రెండు సంవత్సరాల తరువాత ఓ నాడు —

పేపర్లో వడిన ఫోటో చూసి ఆశ్చర్యపోయాడు రాజశేఖరం. దాని క్రింద వ్రాసి వున్న మాటలు అతనిని మరింత విభ్రాంతి పరిచినయ్—"బావా! నన్ను క్షమించి ఎక్కడున్నా సరే ఒక్కసారి ఇంటికి రావూ?—అరుంధతి."

కొన్నిక్షణాల వరకు ఆలోచనారహితుడయి—అరుంధతి పేరు క్రింద వున్న గుంటూరు చిరునామా చూస్తూ వుండిపోయాడు!

అరుంధతి గుంటూరులో ఎందుకున్నది?

అత్తగారి గృహానా?

ఏమో..?

ఏమైనా—!

అతడి వింత ప్రవర్తనకు ఆశ్చర్యపోతూ ఎదురుగా కూర్చున్న ఓ. పి. స్టూడెంట్స్!

జేబులో ఒకతనిని పిలిచి, పోస్టాఫీసుకు వెళ్ళి టెలిగ్రాం ఇవ్వమంటూ ఈ విధంగా వ్రాసి ఇచ్చాడు— "స్టార్టింగ్ ఫ్రమ్ హైద్రాబాద్—టు నైట్— ఎక్స్‌ప్రెస్— రాజశేఖరం."

* * *

ఆకాశాన్ని దట్టంగా మబ్బులు అలుముకున్నాయి. సన్నని తుంపర ఉదయం నుండీ విడవకుండా పడుతోంది.

ఆ రెండో తరగతి రైలుపెట్టెలో, ఖాళీగా వున్న ఓ సీటు మీద జారగిలబడి, అనుకొని కూర్చొని వున్నాడు రాజశేఖరం— చెక్క కాలును సీటు మీదకు జేర్చి రెండవ కాలును క్రిందకు జారవిడిచి!

అలా కూర్చుంటే ఏదో తృప్తి!

ఆ పెట్టెలో, అతడుగాక మరో కుటుంబం వున్నది. ఉద్యోగ రీత్యా మార్పు వచ్చిందేమో, ఆ పెట్టెలో సగమంతా వాళ్ళ సామానుతో నిండిపోయి వుంది! ఇద్దరు పెద్దవాళ్ళు.. నలుగురు పిల్లలు!

రాజశేఖరం కళ్ళు మూసుకున్నా కళ్ళ ముందు ఆ కుటుంబమే మెదలసాగింది.

ఆయనకూ తన కున్నంత వయస్సే వున్నది—

—కాని, భార్య, నలుగురు పిల్లలు, ఇంత సామాను!

తనకో?—ఈ కర్రకాలు తప్ప ఈ ప్రపంచంలో మరేమీ లేదనిపించింది!

ఒకనాడు తన సర్వస్వం అనుకున్న అరుంధతిని గూడా—ఒకవిధంగా—ఈ కర్రకాలే తనకు దూరం చేసింది!

అవును! ఏలాంటి తను ఏలా అయ్యాడు?

గార్డు విజిల్ వూదాడు. ప్రయాణీకుల్ని చిన్నగా ఒక వూపు వూపి రైలు ముందుకు కదిలింది.

—రాజశేఖరం మనస్సు కదిలిపోయింది, అతడి ఆలోచనలు పరుగెత్త సాగినయ్.....

ఒకనాడు—తను, అమ్మ, నాన్న, గుర్రబ్బండి దిగి గడపలో కాలు పెట్టగానే అత్తయ్య తన బుగ్గ పట్టుకొని, "నీకు పెళ్ళాం పుట్టిందిర!" అన్నది.

దూరంగా నిలబడి వున్న మామయ్య ఫక్కున నవ్వాడు.

తరువాత కొద్దిక్షణాలలోనే, తను నవ్వగా, ఒక్కగా, ఉయ్యాలలో కళ్ళు సగం మూసుకొని పడుకొని వున్న పసిపాపను చూచాడు. ఆక్షణంలోనే తొలిసారిగా ఆ పాప తన జీవితంలో ప్రవేశించింది. ఆ మరువాడే ఆ పాపకు 'అరుంధతి' అని పేరు పెట్టారు!

అరుంధతి!—ఎంత చక్కని పేరు?

పేరేగాదు!—అరుంధతి మాత్రం?

—అనుకోని పరిస్థితులలో, మామయ్యగారి గృహంలో సభ్యుడయ్యాడు తను. పదో సంవత్సరంలో తల్లిని తండ్రిని పోగొట్టుకొని, ఆ గృహంలో ప్రవేశించిన తనకు, రెండు సంవత్సరాల క్రితం ఆ వాన రోజు అర్ధరాత్రి వరకు—ఆ గృహంలోనే అరుంధతి కళ్ళ ఎదుట కాలం గడిపాడు—అరుంధతితో గూడిన తీయటి కలల్లో కరిగిపోతూ!

—కాని, తన కలలన్నీ, కల్లలేనని తరువాత తరువాత తెలిసి వచ్చింది!

మామయ్య ఎంతగా పట్టుబడితేనేం అత్తయ్య ఎంతగా బ్రతిమలాడితేనేం?—అరుంధతి మనస్సు తనని భర్తగా అంగీకరించటానికి ఎదురు తిరిగింది!

ఆ గృహంలో, అరుంధతి మూలకంగా, తను పరాయివాడయిపోయాడు.

అంతేకాదు—

దానికి తోడు కారుప్రమాదంలో—అందువా అజాగ్రత్తతో అరుంధతి కారు నడిపిన తరువాత—ఎంత జాగ్రత్త పడితేనేం—తన ఎడంకాలు స్థానంలో కొయ్యకాలు స్థిర నివాస మేర్పరుచుకున్నది!

దాంతోనే—తనను, అల్లుడిగా స్వీకరించేందుకు—వాళ్ళ సహకారాన్ని గూడా పోగొట్టుకున్నాడు!

—ఇంకా తనకక్కడ స్థానమేది?

—అందుకే ఆరాత్రి!...

సన్నని తుంపర, మరింత బలాన్ని పుంజుకొని జల్లుగా మారింది. రెండు చేతుల్నీ బలంగా ఉపయోగించి కిటికీకి అడ్డంగా అద్దాన్ని పైకి లాగాడు.

అద్దంలోకి కన్నార్పకుండా చూస్తుంటే రెండు సంవత్సరాల క్రితం తను చూచిన అరుంధతి కనబడుతుంది—ఆమె తనను తిరస్కరించటానికి తనలోని బీదరికమే కారణమని తనకు తెలుసు. అప్పైన పులి మీద పుట్రలా కొయ్యకాలు!

నిజమే!—

లక్షాధికారి అయిన తన మామయ్య కూతురు—ఆ దాల భరిణ తనలో ఏం చూసి భర్తగా ఎన్నుకుంటుంది?

కాని పిచ్చి ఆశతో, పిచ్చి వూహలతో ఆ గృహంలో కాలం గడిపాడు!— ఫలితమనుభవించాడు!

అరుంధతి లోకసహజంగానే ప్రవర్తించింది! కాదని తనేలా అనగలడు?

కాని, ఈనాడు?

ఏమో?—తనను ఎందుకు అరుంధతి అంతగా చూడాలని కోరుకుంటున్నదో?.. విచిత్రంగానే వున్నది!

తను క్షమించవల్సిన అవసరం అరుంధతికి ఎందుకు కలిగింది?'

—అవి రెండూ, తనకు అర్థంగాని ప్రశ్నలయి, రెండు నిప్పుకణాల్లా రైలు వెంట తనని అనుసరిస్తూ పరుగెడుతున్నాయి!

తన కుంటికాలును, తన బీదరికాన్ని చూచి పరిహసించేందుకా? తను ప్రస్తుతం ఏలాంటి స్థితిలో వున్నదీ చూచి ఈర్ష్య చెందమని హేళన చేయటానికా?

"ఏమో?"

ఇవన్నీ తనకు, అరుంధతిని చూచేటంత వరకు అర్థంగాని ప్రశ్నలే!

గుంటూరులో రైలు ఆగినప్పుడు, దడ దడ లాడే గుండెతో కాలుక్రింద పెట్టాడు సంచీని చేత్తో పట్టుకొని!

చిన్నగా ఒక్కొక్క అడుగే ముందుకు వేయసాగాడు.

అలా నాలుగు అడుగులు ముందుకు వేశాడో లేదో, ఒకవ్యక్తి వచ్చి రాజశేఖరం చేతిలోని సంచీ అందుకుంటూ, "నన్ను అరుంధతమ్మగారు పంపారు బాబూ!" అన్నాడు.

వయస్సు మీదిరి నల్లబడ్డ ముఖాన్ని అప్పుడే భుజాన వున్న మాసిన తువ్వాలు ముక్క పెట్టి తుడుచుకున్నట్లున్నది. మనిషిని అంతకు క్రితం ఎక్కడా చూచినట్లు గుర్తుకు రావటంలేదు.

మౌనంగా అనుసరించాడు రాజశేఖరం.

తన కంటే పదడుగులు ముందు వేసిన అతడు ఒక గుర్రబ్బండి దగ్గర నిలబడి సంచీని లోపల పెట్టాడు.

రాజశేఖరం వెనగ్గా వెళ్ళి చిన్నగా

నిక్కసాగాడు:

అతడు దగ్గరగా వచ్చి, "పట్టుకోమంటారా?" అడిగాడు.

"అవసరంలేదు!"

అతన్ని ఎన్నో అడగాలనిపించింది...కాని ఒక్కటీ అడగలేదు. అడగలేకపోయాడు!

టకటక మోత చేసుకుంటూ గుర్రపుబండి ముందుకు కదిలింది. తనని ఏదో భయంకర ప్రదేశానికి మేళతాళాలతో, తీసుకువెళుతున్నట్టుగా వున్నది ఆ గుర్రపుబండి మోత.. క్షణక్షణానికి మనిషిని భయం ఆవరించగా ఉరికంబానికి దగ్గిర పడుతున్నట్టుగా ఫీలవ్వసాగాడు..వళ్లంతా చెమటలు పట్టసాగింది.

అరుంధతీ నాకెలాంటి పరీక్ష పెట్టావ్? కొద్దిక్షణాలలో—నీవు నన్ను అనుమానమనే చక్రంలో బిగించి గిరగిరా త్రిప్పి పాతాళంలోకి విసిరివేయుదువు గదా అరుంధతీ?

నేను నీకేం హాని చేశాను?

నేనేం పాపం చేసుకున్నాను?

—శరీరమంతా అవిర్లలో తేలిపోతుంది. ఒక్కసారి ఆ పోతున్న గుర్రపుబండి లోపల నుండి బయటపడి, ఏ దూరతీరాలకో—అరుంధతిని జీవితంలో మరి చూడకుండా పారిపోవాలనిపిస్తోంది—

ఆ ఆవేశాన్ని ఆపుకోలేకపోయాడు.

అసలు అరుంధతిని చూడడు—చూడలేడు—ఆమె చేతిలో పరాభవం పొందలేడు

"ఏయ్ బండి ఆపు" పెద్దగా అరుద్దామన్నంత ఉద్రేకంతో ముందుకు వంగబోయాడు

అప్పటికే ఆ గుర్రపుబండి రెండడుగుల మీద ముందు ఆగి వున్నది బండతను దిగి వెనక్కువచ్చి నిలబడ్డాడు

ఇక చేసేదే వున్నది? -చిన్నగా ముందుకు వంగి, ఎదురు హ్యాండిల్ పట్టుకొని, చెక్క మెట్టు మీద కాలపెట్టి క్రిందకు దిగాడు.

ఆ ఇంటి ముందు ఎడంప్రక్కగా పాదు చేసుకున్న బత్తాయి చెట్టు పై భాగమంతా కప్పి వేసింది. ఒక ప్రక్కగా విచ్చి విచ్చని రెండు మొగ్గలతో వున్న గులాబీ చెట్టు అంత పెద్ద ఖాళీ స్థలంలో ఒంటరితనాన్ని ఫీలవుతున్నట్టుగా విచారంతో తలవంచుకొని వున్నది.

చిన్నగా ఎడంవాలు టకటకా మోత వేయసాగింది.

# అరుణోదయం

బండిలో కూర్చొని వుండగా ఆవరించిన ఆవేశమంతా వీడిపోయి నట్లనిపించింది. ప్రశాంతంగా—ఏదో తెలియని—ఎప్పుడూ లేని—లోకంలోకి వెళ్లిపోతున్నట్టుగా లోపలకు అడుగులు వేయసాగాడు.

అరుంధతీ ఎక్కడున్నావ్?

ముందు గదిలోకి వెళ్లాడు.

"అరుంధతీ!" తెలియని మృదుత్వం కంఠం నుండి జారింది. "అరూ!.."

అరుంధతిని చూచి ఎన్నాళ్లయింది?

ఇంకా రెండడుగులు ముందుకు వేశాడో లేదో, ఎదురుగా వున్న కర్టెన్ తొలగించుకొని—

—తొలగించుకొని....

అతడి కళ్లు తిరగసాగినయ్..

ఆమె అరుంధతి

..అరుంధతే! ఆమె?

..అరూ ..పెద్దగా, పిచ్చిగా కేకవేశాడు

ఆమె ముఖాన బొట్టు ఏమైంది?

ఆమె చేతి గాజులు ఎందుకు తీసివేశారు.

"భగవాన్"

* * *

"కూర్చో బావా"

దూరంగా, తలుపు ప్రక్కగా పీట వేసింది.

తలవంచుక కూర్చున్నాడు. ప్రపంచం సర్వనాశనమైపోతే, తను ఒంటరిగా మిగిలి పోయినప్పుడు—ఏం చేయాలో తోచక గిల గిలలాడే వ్యక్తిలా—కూర్చున్నాడు రాజశేఖరం అరుంధతికి ఎదురుగా.

అరుంధతి తలవంచుకొని కూర తరుగుతుంది.

"అరూ ...ఏమిటిది?.. ఎందుకిలా జరిగింది?.. అసలు ఎలా సంభవించింది అరుంధతీ?" కంటి వెంట నీరు పొర్లుకొచ్చేలా వున్నది.

"బావా ఎంత చేస్తే అంతే మనకు దక్కుతుంది!.. దానికి ఈనాడు బాధపడటం దేనికి?.. నా జీవితం అనుకోని మలుపు తిరిగిన మాట వాస్తవమేగాని.. అది సరైన మలుపేనని మాత్రం నాకనిపిస్తోంది.. చేసిన పాపం ఊరికే ఎన్నడూ పోదు బావా!"

అరుంధతి ఆ మాటలు ఏ ఉద్దేశ్యంతో అన్నదో గ్రహించలేనంత తెలివితక్కువ వాడు కాదు రాజశేఖరం!

తనని ఒకనాడు తిరస్కరించింది—దాని ఫలితం ఇది అంటోంది!

కాని—ఆమె తనని తిరస్కరించినంత మాత్రాన ఆమెకు ఇలా జరగాలని తను కలలో కూడా అనుకోలేదు—తనకి అరుంధతి మీద కోపం కలిగిన మాట వాస్తవమే.. ఆ కోపంలో ద్వేషించిన మాటా వాస్తవమే. కాని...కాని..కాని..

ఇది మాత్రం తను భరించలేని నగ్న సత్యం!

"లేదు... అరుంధతి.. లేదు!.. నీవు ఇది భరించవలసినంత తప్పు చేశావా?"

"లేదంటావా?" తలెత్తి సూటిగా రాజశేఖరం కళ్లల్లోకి చూడసాగింది.

ఆమె చూపులో చూపు కలపలేక పోయాడు రాజశేఖరం. ఆమె కుంకుమ లేని మొఖాన్ని చూడలేకపోయాడు. విచలితుడయి తలదించుకున్నాడు.

అప్పటివరకు గూడు కట్టుకొని వున్న నీరు కనురెప్పల క్రింద నుండి జారి ఒళ్లో పడింది.

అరుంధతి పేలవంగా నవ్వింది. "పిచ్చి బావా! ఎన్నో చదివిన నీవు ఈ ప్రపంచంలో ఇలా వుండిపోయావంటే.. నీ అమాయకత్వమే కారణం బావా!"

అర్థంకాలేదు రాజశేఖరానికి!

"స్నానం చేద్దువుగానిలే.. భోజనం చేసిన తరువాత తీరిగ్గా కూర్చొని ఈ అరుంధతిని గురించి ఆలోచిద్దువుగాని!" అన్నది తిరిగి నవ్వటానికి ప్రయత్నిస్తూ.

"జబ్బు ఏమిటో చెప్పనే లేదు...!" అన్నాడు రాజశేఖరం. ఇంకా అతడు ఆ షాక్ నుండి కోలుకోలేదు.

"బావా!.. మనిషి చచ్చిపోవటానికి జబ్బే కారణమైతే ఏ జబ్బైనా ఒకటే..ఇప్పుడవన్నీ ఎందుకు..లేలే! సూర్యుడు అప్పుడే పడమటికొస్తున్నాడు!" అన్నది కత్తిపీట పక్కన పడేసి.

లేచి, రాజశేఖరం ముందుగా నడిచి బయటకు వస్తూ, "గోపన్నా!" అని పిలిచింది.

రాజశేఖరాన్ని తీసుకువచ్చిన బండి అతడు వచ్చాడు.

"మధ్యాహ్నం భోజనానికి ఇక్కడికే రా. నీకూ వండుతున్నాను!"

"సరేనమ్మా!.."

తిరిగి వెనుదిరిగి వస్తూ, "ఒక్కొక్కసారి అనిపిస్తుంటుంది. దేవుడున్నాడో లేడో నాకయితే తెలియదుగాని... మనం

గడిపే ఈ జీవితం మాత్రం మన చేతుల్లో లేదూ! అని!" అన్నది మొఖాన్ని పక్కకు తిప్పుకుంటూ.

"అరుంధతీ!" ఆవేశంగా అరిచాడు రాజశేఖరం.

"లేదు బావా! ఇప్పుడవన్నీ ఎందుకులే, లే!..పద.. స్నానం చేద్దువుగాని..!" అన్నది పైట చెంగుతో కళ్ళొత్తుకుంటూ.

ఆమె అతడి క్రకాలు వంక ఒక్క క్షణం నిర్జీవంగా చూసి ముందుకు అడుగులు వేసింది.

"గోపన్నా! అయ్యగారికి నీళ్ళు తోడి పెట్టు!"

చిక్కుకున్న ఆవేదనా వలయం నుండి బయట పడుతున్నట్లుగా చిన్నగా తలుపు ఆసరాతో నిలబడి మధ్యగదిలోకి వచ్చాడు.

స్నానంచేసి ఉతికిన గుడ్డలు కట్టుకొని తిరిగి అరుంధతి ఎదురుగా పీట మీద కొచ్చి కూర్చున్నాడు.

తరువాత ఆగగంటకు అన్నం వడ్డిస్తూ రాజశేఖరం వైపు చూడకుండానే, "నాకీ జీవితంలో మిగిలినవి మూడే బావా!" అన్నది కంఠం జీరబోయింది.

నోట్లో పెట్టుకోబోతున్న ముద్దను అలాగే చేతిలోనే వుంచుకొని, కళ్ళు పెద్దవి చేసుకొని ఆశ్చర్యంతో, "ఏమిటవి?" అన్నాడు.

"నీవు, అరుణ, ఈ యిల్లు—కాదంటే కాస్త కూస్త డబ్బు!" ఆమె కంటి వెంట నీరు బొట బొట కారసాగింది. అందుకే ఆమె తన మొఖాన్ని రాజశేఖరం తలవంచుకునేటంతవరకు ముందుకు తిప్పలేదు.

బాధతో చేతిలో ముద్ద కంచంలో వదేస్తూ చేత్తో కెలకసాగాడు.

రెండు సంవత్సరాల క్రితం అరుంధతి కంఠానికి, ఈ కంఠానికీ పోలికే లేదనిపించింది.

"అరూ...!" బాధతో మూలిగేడు.

అరుణ ఎవరు అని అడుగుతాడేమోనని—తలెత్తి రాజశేఖరం మొఖంలోకి చూడసాగింది.

బాధను భరించలేనట్లుగానే కంటిలోని నీటిని ఆపుకోలేకపోతున్నాడు రాజశేఖరం.

అరుంధతి కళ్ళు రెపరెపలాడించి, "కానియ్ బావా! భోజనం చేసేయ్!" అన్నది.

ఒక్క క్షణం అరుంధతి మొఖంలోకి తలెత్తి చూసి గబగబా అన్నం కలుపుకు తినసాగాడు.

* * *

## అరుణోదయం

సరిగ్గా పన్నెండు గంటలయింది.

గోడనున్న గడియారం కొట్టిన పన్నెండు గంటలను, తనకుంటి ఎడంకాలు మీద బెల్టు తీసేసిన మేర చేత్తో రుద్దుకుంటూ లెక్కవేశాడు.

"నిజంగా అరుంధతి జీవితం— వెన్నెల వెలుగుతో గడిచిపోవాల్సిన ఆమె జీవితం— ఎలా అయిపోయింది?"

—తన జీవితం మాత్రం?

తలుపు మీద ఎవరో కొడుతున్నారు.

లేవబోయాడు. క్రింద వున్న చేతికర్రను తీసుకునేటందుకుగాను వంగి చేత్తో తడమసాగాడు.

అప్పటికే అరుంధతి వచ్చింది. "నీవు పడుకో బావా!.. నేను తీస్తాను.. అరుణ వచ్చింది!"

ఇందాక అరుంధతి మాటల్లో అరుణ పేరు ఓసారి విని వున్నాడు. అందుకనే ఆత్రంగా తెలియని ఉత్సుకతతో, తీసిన తలుపు వంక చూడసాగాడు.

అరుణ లోపల కాలు పెట్టింది.

చామనచాయ రంగులో వున్న ఆమె మొఖం ఎండకు కంది వింతగా మెరుస్తోంది. చేతిలోని పుస్తకాలు పట్టు తప్పుతున్నట్లు బరువుగాజారుతున్నాయి. అసలే కందిన మొఖం పరపురుషుడిని చూడటంతో మరింత ఎర్రబడింది.

"నా అరుణ!" అంది అరుంధతి రాజశేఖరం వంక చూస్తూ. ఎందుకో ఆమె అలా అంటున్నప్పుడు కంఠంలో గర్వం తొణికిసలాడింది.

అరుణ కళ్ళు సగం ఎత్తి, సిగ్గుతో తలవాలుస్తూ "నమస్కారం!" అన్నది.

"నమస్కారమమ్మా!"

అరుణ పక్కగదిలోకి వెళ్ళిపోయింది.

దారి తప్పినట్లు అరుంధతి ఆగది లోనే ఇంకా తచ్చాట్లాడసాగింది.

"ఎవరీ అమ్మాయి?" రాజశేఖరం కంఠంలో ఉద్విగ్నత ఉబికింది.

"ఓ గులాబీ!" సూటిగా రాజశేఖరం మొఖంలోకి చూస్తూ అన్నది.

"పెంచుకుంటున్నావా?"

అరుంధతి కనబడింది. మొఖంలో కలవరమూ పొడసూపింది. నిగ్రహించుకుంటూ, "అవును.. అవును.." అన్నది త్వరత్వరగా.

"ఏం చేద్దామనుకుంటున్నావ్?" అనేం గతమైన ప్రశ్నే అనిపించినా, ఒక్క క్షణం తటపటాయించి అడిగేశాడు.

"నా దేవుడికి సమర్పిద్దామనుకుంటున్నాను" తూలుతున్నట్లుగా అడుగులు పక్కగదిలోకి వడివడిగా వేయసాగింది

పక్కగదిలో గాజుల చప్పుడయింది

"ఏ దేవుడు?" ఆమె పడుతున్నంత వడిగానే అడిగేశాడు—కాని, అప్పటికే ఆమె వెళ్ళిపోయింది

అయితే, ఆమె మాటలు మాత్రం విన వచ్చాయి.

"కాళ్ళూ చేతులూ కడుక్కోని రా అరుణా అన్నం పెడతాను"

* * *

"నీవు కాదనటానికి వీల్లేదు బావా. ఈ ప్రపంచంలో నన్ను అర్థం చేసుకున్న వారెవ్వరూలేరు. నీ మాటుకు నీవు అర్థం చేసుకున్నావో లేదోగాని నాకు మాత్రం నమ్మకమున్నది నీవు నన్ను అర్థం చేసుకో గలవని. ఇక ఏ ఆచ్ఛాదనా లేకుండా దూరంగా నిన్ను పూజించుకోలేను బావా నేను..."

"నీ మాట ఏలా కాదనాలో నాకు అర్థం కావటం లేదు అరుంధతీ.. కాని నా మీద ఆశలు పెట్టుకున్న కొంతమంది విద్యార్థులను నిరుత్సాహపరచాలంటే బాధగా వున్నది.. వాళ్ళకు నాలుగయిదు రోజుల్లో వస్తానని వాగ్దానం చేసి వచ్చాను." అన్నాడు తల రుద్దుకుంటూ రాజశేఖరం.

అరుణ లోపల గదిలో కిటికీ ప్రక్కనే నేను కుర్చీలో కూర్చొని రాజశేఖరం మాటలను ఆసక్తిగా వింటున్నది.

"ఈ రోజే ఉత్తరం వ్రాసేయ్ బావా!.. రాలేకపోవటానికి విచారం వ్యక్తపరుస్తూ—వాళ్ళకు నిరాశ కలిగిస్తున్నందుకు క్షమాపణంతో!"

"అరుంధతీ! పరీక్షల ముందు వాళ్ళను దగా చేస్తే ఎంతగా నొచ్చుకుంటారో వూహించుకో అరూ!"

అరుంధతి నిట్టూర్పు విడిచింది. తల పక్కకు తిప్పుకుంటూ, ఒక్కసారి పెదిమను పంటి కొసతో కొరుక్కొని, "సరే బావా ఇక చేయగలిగిందేమున్నది...నేనూ అరుణా కూడా వస్తాం!.. ఈ రాత్రికే వెళ్దాం పద!.. వాళ్ళ పరీక్షలయిపోగానే తిరిగి వచ్చేద్దాం!" అన్నది.

తరువాత పక్కగదిలోకి వడివడిగా వెళ్ళి తోసాగింది.

తలుపు ప్రక్కగా వున్న అరుణ చటుక్కున తలవంచుకొని, కన్నులను చేతితో తీసుకున్న పుస్తకం మీద కేంద్రీకృతం చేసింది.

"అరగా.." ఆవేశంగా రాజశేఖరం. లేచి యాడు. "నీ యిష్టం అరుంధతీ!. నీ యిష్టం.. నీ యిష్టం వచ్చినట్లు వ్రాయి.. సంతకం పెట్టేస్తాను.. వెంటనే వ్రాసేయ్ అరుంధతీ!" మొహంమీద రెండు చేతులూ కప్పుకొని, తల పక్కకు తిప్పు కున్నారు.

—అరుంధతి మాటలకు ఎదురు చెప్ప లేని అశక్తు డెందుకవుతున్నాడో తనకే ఆశ్చర్యంగా వున్నది!

మొహాన్ని గోడ వైపుకు తిప్పుకొని పడు కున్నాడు. కళ్ళు మూసుకున్నా నిద్ర పట్టటంలేదు. అరుంధతి కళ్ళ ముందు విష్ణ్వేసుకు కూర్చున్నది.

అరుంధతికి తన మీద ఎందుకంత జాలి ఏర్పడింది?

అరుంధతి తనని, తన ఆచ్ఛాదనలోకి, తన బంధాల్లోకి ఎందుకు లాక్కుంటున్నది?

అరుంధతే దీనికి సమాధానం చెప్పాలి!

తరువాత పావుగంటకు గాబోలు—చిన్నగా దగ్గిన చప్పుడయితే మెడ ఎత్తి చూచాడు.

అక్కడ నేల మీద అరుంధతి కూర్చొని వున్నది. ఆమెచేతిలో లెటర్ ప్యాడ్, కలమూ వున్నాయి.

చిరునవ్వుతో, "చెప్పు.. ఏం వ్రాయ మంటావ్?" అన్నది.

"ఏం చెప్పమంటావ్?.. నీవే ఏదో ఒకటి వ్రాసేయ్!" అన్నాడు కళ్ళు నగువార్చి.

వ్రాస్తూ, "సామాన్లు గూడా ప్యాక్ చేసి రైల్లో పడేయమంటాను.." అన్నది అరుంధతి తలఎత్తి.

"సామాన్లంటూ ఏంవున్నాయి?.. పెట్టె, బెడ్డింగ్ కొన్ని పుస్తకాలు!"

అతడు శూన్యంలోకి చూస్తున్నాడు!

* * *

"అరుణకు ట్యూషన్ మాన్పిద్దామను కుంటున్నాను!" అన్నది అరుంధతి గడప మీద కూర్చుంటూ.

"మాన్పించి?.." తలెత్తి మాటిగా ఆమె మొఖంలోకి చూస్తూ అన్నాడు.

పల్లెటూరి ఉండుండి మీదగాపోతుంది.

అరుణయూట పేము కుర్చీల్లో అరుంధతి రాజశేఖరం కూర్చొని వున్నారు.

అరుణ గడప మీద తలవాలచుకు కూర్చుని పక్కన నేలపై పిచ్చి గీతలు గీస్తోంది.

మళ్ళా రెట్టించాడు. "మాన్పించి ఏం చేద్దామనుకుంటున్నావ్?"

అరుంధతి నవ్వింది.

"అరుణ ఏం చదువుతున్నాదో మీకు తెలుసు గదా?"

"మెట్రిక్ కదూ?"

"అవును!"

"బి. ఎ. చదివేవాళ్ళకు ట్యూషన్ చెప్పే మీరు అరుణకు చెప్పటమా?"

"అంటే వాళ్ళు ఉద్యోగంలో దా ఏర్పరు స్తున్నానన్నమాట!" నవ్వి అన్నాడు రాజశేఖరం.

"అంతే మీకు లేదనుకో!" ఫక్కున నవ్వింది అరుంధతి.

"ప్రతిపనికీ డబ్బు లెక్కబెట్టరు ఉద్యోగంలో...ఉద్యోగంలో" అంటూ ఆపి పరువాత, ఆఫీసరు ఏం చెప్పినా గొణక్కుండా చేసి తీరాలి!" మందింత పెద్దగా నవ్వుతూ అన్నాడు రాజశేఖరం.

అరుంధతి చటుక్కున తలెత్తింది.

ఆమెముఖం నల్లగా మారిపోయింది.

పెదిమలు భయంతోను, వేదనతోనూ అల్లల్లాడినయ్.

కంఠం గిరగోయింది.

నీరసమైన గొంతుతో, "వద్దు బాబా వద్దు అరుణను అక్కడికే వెళ్ళనియ్!" అన్నది. మాటలు నంగి నంగిగా వున్నాయి.

ఎందుకో విచిత్రంగా అరుణమొఖంలోకి చూసింది.—అరుణ అక్కడలేదు.

* * *

రాజశేఖరానికి ఆరాత్రి నిద్ర పట్టలేదు. ఆలోచనలు పిచ్చిపిచ్చిగా పోసాగినయ్.

అరుంధతి తనను ఎందుకు పిలిపించింది?

అరుణని గాకుండా ఏమొగపిల్లవాడినో తెచ్చుకొని పెంచుకొనివున్నట్లైతే—ఆమెకు నిజంగా, ఎప్పటికైనా ఎంతో సహాయకారిగా వుండగలిగే వాడు!

రాజశేఖరం నిద్ర పట్టక అటూ యిటూ కదలటం చూసి అరుంధతి అడి గింది. "నిద్రపట్టటం లేదాబాబా?"

తనమంచానికి వేసివున్న దోమతెరలో నుండి అరుంధతి తన మంచంమీదలేచి కూర్చోవడం చూశాడు.

"ఊహూ...." అన్నట్లుగా గొణిగాడు.

"ఏదో ఆలోచిస్తున్నట్లున్నావ్?" అతి నెమ్మదిగా ప్రశ్నించింది.

"ఆలోచించటానికి ఏవున్నది?"

"అరుంధతి అనే వలయంలో చిక్కుకొని బాధపడుతున్నావా?" చిన్నగా నవ్వటానికి ప్రయత్నించింది.

"అదేదో భయంకర వలయం అనుకొని మనస్సును ఎందుకు నలిపేసుకోవాలి.?. నాకెందుకో అనిపిస్తోంది— జరగవలసిన చోటుకే జేరావేమోనని!...... జరిగింది ఒక పీడకల అనుకుంటే, ఇకముందు జీవితంలో కొత్తదనం గాని, విచిత్రంగాని ఏదీ కనబడదు!"

"నిజాన్ని పీడకలగా ఎలా ఊహించను

(62వ పేజీ చూడండి)



శ్రీమతి రాధామోహన్

# పత్రికలూ - ప్రేమకథలు

ఈ ప్రశ్నకు ఒకవిధంగా సమాధానం చెప్పాలి అంటే "కొంత దూరంగానే ఉంది" అని చెప్పవచ్చు.

పుస్తకాలలో వ్రాస్తున్నారూ అంటే సినిమాలు అవిమాపి మనస్సులోకి వచ్చిన అందమైన ప్రాహ్ని కథారూపంలో పెడుతూన్నారు చాలామంది. విజావికి కథలలో వ్రాసినట్టుగా నిజ జీవితంలో జరుగుతూవుంటే మనకీనాడున్న సమస్యలు అసలు లేకేపోవును. అడుగడుగునా మన దేశాన్ని, జాతిని, సంఘాన్ని సంక్షోభావం అనేది లేకుండా బలహీన పరుస్తున్న కులతత్వాలు, ఆడపిల్లలుగల తల్లిదండ్రులను రంపపుకోతపెడుతూ కృంగదీస్తున్న కట్నపిశాచాలు మొదలైనవి తలలెత్తకే పోవును. విదేశాలలోలాగ, మన ఆడపిల్లలుకూడ యుక్తవయస్సు రాగానే తమకు నచ్చినవాడిని ప్రేమించి పెళ్లిచేసుకుంటే ఇంక లేనిదేముంది? ఎన్నో సమస్యలు వాటంతటవే పరిష్కరించబడిపోనుగదా?

ఈరోజుల్లో ఏ కథ చదివినా, ఏ నవలచూసినా ఒక సినిమాకు వెళ్లినా ప్రేమతత్వం తప్పితే మరొకటి ఏదీ కనిపించడంలేదు.

ఒక వయస్సు వచ్చేసరికి ప్రకృతి సహజంగ స్త్రీ పురుషులకు ఒకరిపై నొకరికి ఆకర్షణ కలుగుతుంది. యుక్తవయస్సు వచ్చేసరికి అది ఎవరూ నేర్పకుండానే పుట్టుకొస్తుంది. ఈ ఆకర్షణే ఒక వ్యక్తిపై ప్రత్యేకంగా నిలబడి, వారితో తమకు నచ్చిన, తను మెచ్చిన సుగుణాలు కనిపించి ప్రేమ వివాహానికి దారితీస్తాయి. ఈ ప్రేమ ప్రవాహానికి ఆనకట్టే వివాహం. ఈ వివాహతంతు, ఆ దంపతులకు సంఘంలోగల బాంధవ్యాన్ని నిర్ణయిస్తుంది. వివాహంలేని జంటను సంఘం ఆమోదించకుండా వెలివేసినట్లుచూస్తుంది.

ఈ ప్రేమించి పెళ్లి చేసుకోడాలు యీనాడే కాదు. ఆనాడూ ఉన్నాయి. ఇప్పటిమీద అప్పుడె సౌఖ్యదాయకంగా ఉన్నాయని కూడ చెప్పవచ్చు. అందుకు కారణం—అప్పటి పురుషులు తమను నమ్ముకుని మనసిచ్చిన మగువలకు అన్యాయం చేయక పోవడమే. ఆనాడు రుక్మిణిని, ఇష్టంలేని పెళ్లి చేసుకోకుండా, శ్రీకృష్ణుడితో పారిపోయి వచ్చింది. కృష్ణుడామెను వివాహం చేసుకుని, సంఘంలో భార్యగా గౌరవం యిచ్చి నిలబెట్టాడేగాని, మోజు తీరగానే తన దారి తను చూసుకుని, ఆమెనుసంఘ దూషణలకు ఎరజేసి అన్యాయం చేయలేదు.

మన వివాహాలలో ప్రతి వధువుముందు గౌరి పూజ చేస్తుంది. ఆ వధువు ఆరాధ్య దేవతయిన ఆగౌరీదేవికూడ శివుడిని ప్రేమించి పెళ్ళి చేసుకున్నదే గదా. శకుంతల దుష్యంతుడిని ప్రేమించి గాంధర్వ వివాహం చేసుకున్నటు మనం చదివాము. అలాగే దమయంతికూడ నలమహారాజు సుగుణాలను విని ప్రేమించి పెళ్లిచేసుకుంది.

పూర్వకాలంలో పెద్దల సమక్షంలోనే స్వయంవరాల పేరిట ప్రేమ వివాహాలు జరిగేవి. స్త్రీ తనకు నచ్చినవాడిని ఎన్నుకుని, వరించి వివాహం చేసుకునేది. ఈ ఎన్నుకోడాలలో స్త్రీకి పూర్తి స్వతంత్రమున్న పెద్దల సుముఖత్వంతో వివాహాలు అయేవి గాబట్టి, యీ పెళ్ళిళ్ళు సౌఖ్యదాయకం. గానే ఉండేవి.

తర్వాత నిన్న మొన్నటివరకు వధూవరుల యిష్టాయిష్టాలతో సంబంధం లేకుండా పెద్దల నిర్ణయప్రకారం జరిగేవి. ఈ వివాహాలు దైవాధీనం.

కాలం మారింది. బొమ్మల పెళ్లిళ్లలాంటి బాల్య వివాహాలూ లేవు. వధూవరులతో నిమిత్తం లేకుండా పెద్దలు పెళ్లిళ్లు కుదిర్చే రోజులూ పోయాయి. ఆడపిల్లలు చదువుకుంటున్నారు. స్వతంత్రాభిప్రాయాలు కల్గి ఉంటున్నారు. అవసరమైతే పురుషులతో సమంగా ఉద్యోగాలు కూడ చేస్తున్నారు. అవకాశం కలిసివస్తే ప్రేమించడాలూ చేస్తున్నారు.

ఈ కథలు, నవలలు, సినిమాలు వీటి ప్రభావం చాలవరకు నేటి యువతీ యువకులమీద పని చేస్తోంది. ప్రేమించడమే జీవిత పరమావధి అన్నట్లుగా ప్రవర్తిస్తున్నారుకొందరు కథలుచదివి సినిమాలుచూసి, వాటిల్లో హీరోను అనుకరిస్తూ తాము మోడరన్ అబ్బాయిలమనుకుంటూ, ఒక సుముహూర్తంచూసి, అందుబాటులోవున్న ఒక చూడచక్కని చిన్నదానికో ప్రేమలేఖవ్రాసి పడేస్తాడు అబ్బాయి. అక్కడనుంచి కథ మొదలవుతుంది.

నీతోటిదే లోకం, నీవులేని నేను వ్యర్థా అన్నంతయిదిగా ప్రేమించుకున్న ప్రేమికులూ—ఈ ప్రేమ వ్యవహారం పెద్దలకు తెలిసి, రెండు చివాట్లేసి తమ కనువుగావున్న ఒక సంబంధంచూసి ముడి పెట్టేయడంతో— ఎవరికివారే యమునాతీరే అన్నట్టుగా అయిపోయి, చివరికి హాయిగా, ఎవరి జీవిత భాగస్వాములతో వాళ్లు సంసారం చేసుకుంటూరు. ప్రేమకథంతా, కథలాంటి కలగా అనుకుని. అదే కొంచెం బుద్ధిమంతులైతే, తల్లిదండ్రుల నెదిరించి, ఏ మతాంతర వివాహమో, వర్ణాంతర వివాహమో చేసుకో సాహస్తారు.

ఒక రకం మహానుభావులుంటారు. వాళ్ళు "నిన్ను ప్రేమించాను. పెళ్ళి చేసుకుంటాను" అంటూ కబుర్లతో లొంగదీసుకుని, మోసంచేసి చివరకు పలాయనమంత్రం పఠిస్తారు.

మరోరకం ఆదర్శ ప్రేమికులన్నారూ అంటే వాళ్లు తను ప్రేమించినమా యికి మరో యువకుడితో వివాహమవుతూంటే, ఆమెను రచ్చకీడ్వక, "నీవైనా సుఖపడుమా" అని పాడుకుంటూ తను మజ్నూలానో, త్రాగుబోతు దేవదాసులానో అయిపోయి శేష జీవితం గడుపుతూంటూరు.

కాలేజీ చదువుతో ప్రారంభమయే కొన్ని ప్రేమలు, చదువు ఆఖరయేసరికి అవి ఆఖరవుతాయి. అంటే తల్లిదండ్రులు కుదిర్చిన పెళ్లిళ్లతో, కాలేజీతోపాటు అక్కడ ప్రేమించిన ప్రేమలూ వదిలివేస్తున్నారు. నేటి యువతీ యువకులు. అలా అని చదువుకున్నవారందరూ ప్రేమిస్తే చేస్తున్నారని నేను చెప్పడంలేదు. నిజంగా ప్రేమించి తను తెన్నులు చెప్పలేనంతగా చదువు చూసిన ఇంచుమించు ఆ ప్రేమికులు ప్రేమికులే కనిపిస్తున్నారుగాని, తమ జీవితాలు నాశనం చేసుకున్నవాళ్ళు చాలా తక్కువని చెప్పవచ్చు.

"వాళ్లిద్దరూ ఒకేచోట ఉద్యోగాలు చేసేవారట. ప్రేమించి పెళ్లి చేసుకున్నారు" అనో, "ఆ అబ్బాయి, అమ్మాయి మెడికల్ కాలేజిలో ప్రేమించుకున్నారట. ఇద్దరూ పెళ్లి చేసుకున్నారు" అనో వార్తలు చెదిరి అప్పుడప్పుడు మనచెవుల్ని బడుతూంటాయి. నిజమే. స్త్రీ పురుషులని ఎన్నో చూసినా, మాట్లాడినా వెగటుగా భావించే రోజులు గతించాయి. ఇటీవల పెద్ద వయస్సు వచ్చిన స్త్రీ పురుషులు ఒకేచోట కలిసి చదువుకోవడం, ఒకే ఆఫీసులోగాని, వేరు వేరుగా గాని మగవారితో సమంగా స్త్రీలు కూడ ఉద్యోగాలు చేయడం సంభవిస్తోంది.

ఇంతకుపూర్వం స్త్రీకి, పురుషునికి అసలు సంబంధమే ఉండేదికాదు. కాని యిప్పుడు స్త్రీ చదువుకోవాలంటే బయటకు రావాలి. అన్నిచోట్ల స్త్రీలకు ప్రత్యేక విద్యాసంస్థలు లేవు కాబట్టి ఒకేచోట కో-ఎడ్యుకేషన్ తప్పదు. అవసరాన్ని బట్టి స్త్రీలు బయటకువచ్చి ఉద్యోగం చేయవలసి వస్తోంది.

బయటకువచ్చి బాహ్య ప్రపంచంలో మసలుతూండడంవల్ల మగవారితో మాట్లాడడం, అవసరమైనప్పుడు ఒకరి కొకరు సహాయం చేయడం తప్పదు. అందువలన ఒకరి గురించి ఒకరు బాగా తెలుసుకోడానికి అవకాశాలు చాలా ఉన్నాయి. ఆయా సందర్భాలలో ఒకరికొకరు దగ్గరకావడం, ఆపైన యిద్దరూ యిష్టపడితే ప్రేమించుకోడానికి సిద్ధపడడం జరుగుతోంది.

ఇట్టి సావకాశాలు ప్రేమ వివాహాలకు దారితీసి క్రమంగా బాధ్యత తల్లిదండ్రులపైనుండి పిల్లలమీదపడుతోంది. కన్యాశుల్కం ప్రవర్తిస్తే ఈ మార్పు ఎంతో మంచిదే. కాని ఇందులో సొంత పాటు మాత్రం పడ్డారా, అది జీవితాంతం సరిదిద్దుకోవడానికి వీల్లేకుండా పోతుంది. అందువలన యిట్లాంటి విషయాలలో వివేకం, ఆలోచన ఎంతైనా అవసరం.

ప్రేమించేటప్పుడు జాతి, మతం, సంప్రదాయం అన్నీ చూసుకుని తీరుబడిగా ఎవరూ ప్రేమించరు గదా?—అందువల్ల యిలాంటి వివాహాలు జాతి సమైక్యతకు దారితీసి, కట్నాల నిర్మూలనకు చాలవరకు తోడ్పడుతాయి కూడ.

మనం కథలలో యువతీ యువకులు పార్కుల్లో కలుసుకున్నట్టు, సినిమాలకు షికార్లకు కలిసి వెళ్ళినట్టు, జంటగా పిక్నిక్‌లకు తిరిగినట్టు చదువు

తూంటాం. నిజం చెప్పాలి అంటే యివి వాస్తవికతకు కొంచం దూరంగా ఉన్నాయనే చెప్పవచ్చు.

మనదేశంలో పట్నాలకంటే పల్లెలు, విద్యార్థులకంటె విద్యావిహీనులు ఎక్కువ. అవతలివాడి ప్రమేయం మనకెందుకన్న దృష్టికంటె, వాళ్ళెక్కడకు వెళ్ళారు, ఏం చేస్తున్నారు, ఎలా తిరుగుతున్నారు, ఎవరెవరితో మాట్లాడుతున్నారు అని ఎక్సురే కళ్ళు, గోడలకు చెవులు పెట్టుకునే మనుష్యులు అధికం. సంస్కారం, సహృదయం చాలా తక్కువ. నాగరికతలో కూడ మనవాళ్ళు అంత ముందుకు వెళ్ళలేదు.

కనుక యువతీ, యువకులకు ప్రేమించుకునే అవకాశాలు మనవైపు చాలా తక్కువ. చిన్న ప్రదేశాలు అవడంవలన వీరు నలుగురికళ్ళలో పేగాక, నలుగురి నోళ్ళలోనూ పడే అవకాశముంది. ఈరకం యువతీ యువకులనుచూస్తే మన సంఘం కాకుల్ని పొడిచినట్టు పొడుస్తుంది.

ఇన్నిటిని ఎదుర్కొని ప్రేమించిన వారి ప్రేమ వివాహంవరకూ రాదు. కొందరు స్త్రీలు మోసపోయి ఆత్మహత్య చేసుకోవడం, వరుడు పలాయనం చిత్తగించి వేరొయిగా పెళ్ళి చేసుకోవడం జరుగుతుంది. ఆత్మహత్య చేసుకోగల ధైర్యంలేని స్త్రీ అయితే సంఘంలో వెలివేయబడి పతితగా జీవిస్తుంది.

ఒకవేళ తెగించి ఆ ప్రేమికులు పెళ్ళిచేసుకున్నా ఎక్కడో కొన్ని జంటలుతప్ప మిగతావి సుఖపడడం అరుదు.

భార్యా భర్తల్లో ఒకరు శాకాహారులూ, మరొకరు మాంసాహారులూ అవుతారు. అప్పుడు ఒకరు వాటిని తినడమైనా మానాలి. లేక మరొకరు వాటిని తినడమైనా అలవర్చుకోవాలి. ఈ రెండూ జరగడం అసంభవమే. అందులో ఒకరు నోరు కట్టుకోలేనివారవుతారు. మరొకరు అలవర్చుకోలేనివారవుతారు. అలాంటప్పుడు ఒకరి కొకరు ఇబ్బంది పెట్టుకోకుండా సర్దుకుపోయేవారైనా ఉండాలి అలా జరగనప్పుడల్లా గొడవలు వచ్చే అవకాశముంది.

ఇంకొకటి మతం. మతాలువేరై ఒకరు విగ్రహారాధకులు కావచ్చు. మరొకరు విగ్రహాలను పూజించనివారవచ్చు. అప్పుడు ఎవరి ఆచారాలువారు పాటించుకుంటే బాధేఉండదు. కాని నువ్వు అలా చేయనక్కరలేదు. ఇలా చెయ్యాలి అని ఆంక్షలు ఒకరిపైనొకరు విధించుకోవటంవల్ల, వారి ప్రేమవివాహాలు విచ్ఛిన్నమవడానికి దారితీస్తాయి.

మరొకటి ఆత్మీయులకోసం తపన. ఇద్దరూ కూడ అందర్నీవదిలేసుకుని, వాళ్ళన్నవాళ్ళకు దూరమై దూరంగా వెళ్ళిపోయి వివాహం చేసుకుంటారు. కొన్నాళ్ళయ్యాక ఆ ప్రేమవ్యామోహం వదిలేసరికి, తమ తమ వారందరూ ఒక్కొక్కరూ జ్ఞాపకం వస్తారు. అప్పుడు తీరికూర్చుని "ఏం బాముకుందామనో, అయినవాళ్ళందర్నీ ఒదులుకుని యింతదూరం వచ్చాను. ఛీ, పాడుబ్రతుకు. సుఖంలేదు" అంటూ ఒకరినొకరు ఆడిపోసుకుని సాధించుకుంటూ కూర్చుంటే, వారికి మనశ్శాంతులు కరువై యిద్దరూ విడిపోవడానికి ఆస్కారమవుతాయి.

జాతులు, కులాలు వేరైనప్పుడు అలవాట్లు, ఆహార వ్యవహారాలు జీవితాలు కొంచెం వేరుగా ఉంటాయి.

పెళ్ళిచేసుకునేముందు యివి వారికి కనిపించవుగాని కొందరి విషయంలో, తర్వాత యివి వేరైపోవడానికి దారితీస్తాయి.

ఇలాంటి జంటలమీదే సమయం చూసి ఒకరాయి విసరడానికి చూస్తారు కాకుల్లాంటి లోకులు. వాళ్ళు కనిపించినంతమేర వారి ప్రేమ వివాహంగురించి కట్టుకథలు అల్లి ప్రచారంచేయడం, గోడలమీద వ్రాయడం, వెళ్తుంటే వెనక అలరవడం, ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ వారిగురించి హేళనలు చేయడం చేస్తారు. బ్రతికున్నంతకాలం ఎక్కడకు వెళ్ళినా, వారిని, వారి సంతానాన్ని పిచ్చికుక్కలను తరిమినట్టు తరుముతారు. ఆజంటసంఘం ధాటికి నిలబడి, ముసలివాళ్ళయి, మనవళ్ళనెత్తినా, వాళ్ళు కనిపించగానే ప్రేలెట్టి చూపుతూ "వాళ్ళు ప్రేమించి పెళ్ళిచేసుకున్నారు సుమా" అంటూనే ఉంటారు.

అందుకే ఆ ధాటికి తట్టుకుని నిలబడలేక, ఒకరి నొకరు ఆడిపోసుకుంటూ, మనశ్శాంతిలేకుండా చేసుకుని, కొన్నాళ్ళకు పిచ్చెత్తి విడిపోతారు మొదట్లోనే. అప్పుడు ఆ లోకులే అలాంటి జంటను వ్రేలెట్టి చూపించి చెప్తుంటారు—"ప్రేమించి, పెద్దల నెదిరించి పెళ్ళిచేసుకుంటే కట్టే ఫలితం చివరికిదే సుమా" అంటూ.

అదే ఢిల్లీ, బొంబాయిలాంటి పెద్ద పట్నాలలో అయితే ఒకరిగురించి ఒకరు చెప్పుకోడానికి అవకాశాలుతక్కువ. ఎవరి గొడవల్లో వాళ్ళుంటారు. ఒకవేళ అలాంటివారు కనిపించినా వింతగా విరగబడి చూసేటంత తక్కువ స్థాయిలో వాళ్ళులేరు. కనుక ప్రేమించిపెళ్ళిచేసుకున్నా, వాళ్ళు సుఖంగా సంసారం చేసుకునే అవకాశాలు ఎక్కువ ఉన్నాయి.

భార్యాభర్తలిద్దరూ బాగాపెద్దచదువులు చదువుకుని ఉద్యోగాలు చేస్తూ ప్రేమించి పెళ్ళిచేసుకున్న జంటలనుకొందరిని మనవైపునా ఎరుగుదును. ఉత్తరాదిలోను చూశాను. కాని వీరు జీవిస్తున్నంత సుఖసంతోషాలు, తృప్తి వారిలో నాకు కనిపించలేదు. అందుకు కారణం—మనచుట్టూ ఉన్న మనుష్యులు, సంఘం అనే అనుకుంటున్నాను. మనం నాగరికతలో ఉత్తరాదివారంత ముందుకు వెళ్ళలేదు.

మనదేశంలో మామూలు వూళ్ళస్థితిగతులు అయితే యిలా ఉన్నాయిగాని పెద్దపెద్ద పట్నాలలో యువతీ యువకులు కలుసుకోడానికి అవకాశాలు ఎక్కువ ఉన్నాయి. స్కూళ్ళకు, కాలేజీలకు వెళ్ళాలన్నా ఆఫీసులకు వెళ్ళాలన్నా బస్సులమీద వెళ్ళాల్సివస్తుంది. బస్సుస్టాపుల్లో ఒకరినొకరు కలుసుకుంటూ వుండవచ్చు. దూరం ఎక్కువ గాబట్టి బస్సుల్లో కలిసిప్రయాణం చేయొచ్చు. పెద్దక్లాసుల్లోకి వచ్చేక, ఒకోసారి పిరియడ్‌కిపిరియడ్‌కి మధ్యచాలా టైముంటుంది. అప్పుడు టైము లైబ్రరీల్లో గడపాల్సివస్తుంది. అక్కడ కలుస్తుండవచ్చు. బస్సులకోసం వెయిట్‌చేసే టైములో తల్లిదండ్రులకు తెల్సకుండావెళ్ళి గడిపే అవకాశాలున్నాయి. ముఖపరిచయస్థులకి దూరంగా, వాళ్ళను తప్పించుకు తిరగడానికి వీలుగ పార్కులు, రహస్యంగా కలుసుకుని కబుర్లు చెప్పుకోడానికి అనువైన స్థలాలు ఉంటాయి.

ఉద్యోగాలు చేస్తున్నప్పుడు, మగవారు పలకరిస్తే సోషల్‌పేరుతో వారితోమాట్లాడాల్సి వస్తుంది. అలాంటప్పుడు కలిసేసివకాశం ఏర్పడుతుంది.

పెద్దపెద్ద సిటీలలో యువతులు తల్లిదండ్రుల ద్వారా క్లబ్బులకువెళ్ళడం, సభ్యత, సంస్కృతి, నాగరికత పేరుతో ఈత, సంగీతం, ఆటలు, డేన్సు వగైరా నేర్చుకొంటున్నారు. ఇలాంటి యువతులనుచూడడానికి పోరిసర్కుకూడ యిష్టపడడంవల్ల, ప్రేమవివాహాలకు దారితీస్తున్నాయి.

ఇలాంటి సంఘటనలు, పెద్దపట్నాల విషయంలో తీసుకుంటే, కొంతైనా వాస్తవికతకు దగ్గరగాఉన్నట్టనిపిస్తుందిగాని, మరికొన్ని కథలలో, పట్నంలో చదువుకొచ్చినబ్బాయి, ఇంతజరిగితే అంతగ్రిందికి గుప్పుమనిపోయే పల్లెటూరొచ్చి, రోజూ చెరువుకు నీళ్ళకొచ్చే అమ్మాయిని చూడడం, తరువాత యిద్దరూ ప్రేమలోపడి చెరువుదగ్గర కలుసుకోవడం, మామిడితోటల్లో ప్రేమకలాపాలు జరపడం, పొలాలవైపు షికారువెళ్ళడం లాంటి సంఘటనలు మాత్రం వాస్తవికతకు అంత దగ్గరగా ఉన్నట్టనిపించవు.






(క) త్వరగా వ్రాయాలి!

పెద్దపెద్ద సంఖ్యలను అక్షరాలలో వ్రాయడం కన్న అంకెలలో వ్రాయడం సులభం అని చాలా మంది అనుకుంటూ ఉంటారు. మీ ఉద్దేశం కూడా అదే అయితే కాగితం, కలంతీసుకోండి. నేను చెప్పబోయే సంఖ్యను అంకెలతో వ్రాయండి. గబగబా వ్రాయండి. వ్రాసినది కొట్టివేయ కూడదు. తడుముకో కూడదు. ఒప్పుకున్నారా? అయితే "పన్నెండులక్షల, పన్నెండు వేల, పన్నెండు వందల, పన్నెండు" ఈసంఖ్యను అంకెలతో వ్రాయండి చూద్దాము.




(చ) పాతనాణేములు

బహు పురాతనకాలపు వస్తువులు, నాణేములు వగైరా ఎక్కడున్నాసరే, ఎంత ఖరీదైనాసరే,కొని జాగ్రత్త చేసే ఒకానొక ధనికుడికి ఒకఉత్తరం వచ్చింది. అందులో ఇల్లావుంది.

"అయ్యా! నేను ఇటీవల మాపెరట్లో త్రవ్వుతూ వుండగా రెండు పాతనాణేములు దొరికెయి. ఒకనాణేముమీద "మొదటి జార్జి" అని వ్రాసివుంది రెండవ నాణెంమీద "క్రీ. పూ 51 వ సంవత్సరము" అని వ్రాసివుంది. ఈరెండు నాణేములు బహు అరుదైనవన్న సంగతి తమకు తెలియనిదికాదు. వీటిని నేను అమ్మడానికి సిద్ధంగా ఉన్నాను......"

మామూలుగా పాతనాణేముల కోసం వందల కొద్దీ రూపాయలు ఖర్చు చేయడానికి సిద్ధపడే ఆ ధనికుడు ఆఉత్తరాన్ని చింపి ముక్కలు చేసి "అంతా అబద్ధం" అన్నాడు.

ఆధనికుడు అల్లా అనడానికి కారణం ఏమిటో ఊహించ గలరా ?

# మెదడుకి మేత




డాక్టర్ మహీధర నళినీమోహన్




(ట) ఎవరు ముందు!

ఒకద్వీపంలో ఉన్న ఖైదులోనుంచి ముగ్గురు ఖైదీలు తప్పించుకొని, ఒడ్డున ఉన్న ఒక పడవను తోసుకొని వెళ్లిపోతున్నారు. వాళ్లు సముద్రంలో కొంతదూరం వెళ్ళేసరికి ఈసంగతి గ్రహించిన పోలీసు వారి మీదికి తుపాకి కాల్చాడు.

పారిపోతున్న ఖైదీలలో ఒకడు తుపాకీ చప్పుడు విన్నాడు. తుపాకీ కాల్చిన పొగ చూశాడు మరొకడు. తుపాకి గుండు తమ పడవ పక్కనినీళ్లల్లో పడిన చప్పుడు విన్నాడు మూడవ వాడు.

దీనినిబట్టి ఆముగ్గురిలో ఎవరు మొట్టమొదట, ఎవరు తరువాత, ఎవరు ఆఖరునతుపాకి కాల్చిన సంగతి తెలుసుకున్నారో చెప్పగలర ?




(త) పరీక్ష నంబరు:—

ఒక కాగితం మీద 3025 అనే సంఖ్య వ్రాసివుంది. అది ఒకడి పరీక్షనెంబరు. అది నడిమికి చినిగిపోయింది. అల్లాచినిగి పోవడం చెడ్డ శకునం అని భయపడుతూన్న కుర్రవాడికి లెక్కల మేష్టారు ధైర్యం చెప్పేరు.

"మరేమీభయంలేదు. ఇదిచాల అద్భుతమైన సంఖ్య. ఇట్లామధ్యకి చిరిగిపోవడంకూడా అద్భుతమే. ఎల్లాగో చెప్పమంటావా? 30కి 25కలుపు. 55 వస్తుంది.దీనిని వర్గించు.

55 × 55=3025 వస్తుంది. అంటే అసలు సంఖ్యవచ్చేసింది చూశావుగా. ఇది చాలా లక్కీ నెంబరు. కనుక నీకేమీ ఫరవాలేదు"

ఈగమత్తు చూచిన పిల్లవాడిముఖం వికసించింది. క్లాసులోని మిగిలిన పిల్లలుఅంతా తమపరీక్ష నెంబర్లుకూడా ఇంత అద్భుతమైనది అవునేమో అని నడిమికి చింపి చూచుకున్నారు కాని ఎవరికీ అటువంటి నెంబరు మరొకటి దొరకలేదు.

ఇటువంటి చిత్రమైన సంఖ్యలు మరోరెండు ఉన్నాయి. వెతికి పట్టుకోండి చూద్దాం!

## జవాబులు

(క) 12121212 అని వ్రాశారు కదూ! అయితేతప్పు. నేను వ్రాయమన్నదిఒకటయితే మీరు మరొకటి వ్రాశారు. మీరు వ్రాసినదికోటి,ఇరవైఒక్కలక్షల, ఇరవైఒక్కవేల రెండువందల పన్నెండు. నేను వ్రాయమన్నది ఇదికాదుగా. తప్పుఎక్కడో తెలిసిందా? అదే నేనైతే 12 13 212 అని వ్రాస్తాను. పన్నెండువందలలో ఒకవెయ్యిఉందికదా, దానిని పన్నెండువేలకు జమచేసి వ్రాయాలి.

(చ) మొదటి జార్జికాలంలో ముద్రించిన నాణేములమీద "మొదటిజార్జి" అని వ్రాసిఉండడం అసంభవం. అతనితరువాతవచ్చిన అదేపేరుగల రాజులను గుర్తించడానికి మనంపెట్టుకున్న అంకెలుఇవి. మొట్టమొదట జార్జి కాలంలో —ఇటుపైనఇంకా ఇదేపేరుగల రాజులు కొందరు రాబోతున్నారనీ, చరిత్రకారుల సౌకర్యార్థం మొదటి జార్జిఅని వ్రాయాలనీ వారు అనుకునే అవకాశములేదు . రెండవజార్జి, మూడవజార్జి....అని నాణేములమీద ముద్ర ఉండవచ్చుగాని, మొదటిజార్జి అని మాత్రంఉండదు.

"క్రీస్తు పూర్వము 51వ సంవత్సరం" అని నాణేముమీద ముద్రింపబడి ఉండడంకూడా అసంభవమే. ఏమంటే మరో 51 సంవత్సరముల తరువాత ఏసుక్రీస్తుపుట్టబోతున్నాడనివారికి తెలిసే అవకాశం లేదు. క్రీస్తు తరువాతవారు సౌలభ్యంకోసం పెట్టుకున్న గుర్తు ఇది.

కనుక "అంతా అబద్ధం" అని అతడు గ్రహించగలిగేడు.

(ట) పొగచూచినవాడు అందరికన్నా ముందర, తుపాకిగుండునీళ్లల్లోపడిన శబ్దంవిన్నవాడు తరువాత, తుపాకి పేల్చిన చప్పుడు విన్నవాడు అందరికన్నా ఆఖరు ఆసంగతి తెలుసుకోగలరు. ఏమంటే మొదటివాడు కాంతివేగంతోనూ (సెకనుకి 1,86,000 మైళ్లవేగం), రెండవవాడు తుపాకిగుండు ప్రయాణం చేయగలవేగంతోనూ (సెకనుకి సుమారు 3, 4 వేల అడుగులవేగం), మూడవవాడు శబ్దవేగంతోనూ (సెకనుకి సుమారు 1087 అడుగులువేగం) తోనూ ఆసంగతిని తెలుసుకోగలరు.

ఈకారణంచేతనె వేటకాడుకాల్చిన తుపాకిచప్పుడు విని జంతువుపారిపోయే అవకాశంలేదు. శబ్దంకన్నా గుండు వేగంగా ప్రయాణంచేస్తుంది. జంతువుకి దెబ్బతగిలిన తరువాతనే చప్పుడు వినబడుతుంది.

(త) $9801 = (98+01)^2 = 99^2$
$2025 = (20+25)^2 = (45)^2$




గడచిన ఈ నలభై ఏభై ఏళ్ల జీవితం లోని తన అనుభవాల పుటల్ని, జ్ఞాపకాల వేళ్ళతో వెనక్కితిప్పి పర్యావలోకించుకుంటే, శారదాంబకి ఎంతో ఆశ్చర్యం మరెంతో ఆనందం కలిగి, గర్వంతోకూడిన తృప్తితో లోలో తనే చిన్నగా నవ్వుకుంటుంది.

అవును. నిజమే! పచ్చీసు ఆటలోలాగే జీవితంలో కూడా ఓటమి అంటే ఏమిటో ఎరగదు తను. అనుకున్నట్టు పందెం వేసి, అతివాకచక్యంతో పావులునడిపి, అందరి కంటే ముందు పండే తనని చూసి ఈర్ష్యతో ఎంతమంది మూతులు తిప్పేవారో! అలాగే ఆశించిన ప్రతీదీ అందుకుంటూ, కోరిన కోరికలన్నీ కొంగుముడిలో భద్రపరుచు కుంటూ చిన్నప్పటి నుంచి ఇప్పటిదాకా జీవితంలో నెగ్గడమే తప్ప మరోమాటే ఎర గని తనని చూసి ఎంతమంది 'అదృష్ట వంతురాలు!' అంటూ అసూయపడతారో ఈ రోజుకి కూడా.

వాళ్ళు అసూయపడడం సహజమే మరి! ఎప్పుడో చిన్నప్పుడు పదహారు పదిహేడేళ్ల వయస్సులో ఉండగా "కేశవరావుని పెళ్లి చేసుకోవాలి, అందమైనవాడు చదువుకున్న వాడు'' అన్న తన ఆలోచనకి విఘాతం వచ్చింది తప్ప, ఆ తర్వాత తను కోరినకోరిక ఏది నెరవేరలేదు! వేసిన పందెం ఏది నెగ్గ లేదు!

పెళ్లిచూపుల్లో సంగీతం రాదని తనని తృణీకరించిన కేశవరావు మీద పంతం బట్టి ఆ తర్వాత కచేరీ చేసేటంత స్థాయికి తను సంగీతం నేర్చుకోలేదూ? చదువు కున్నవాడు కాకపోతేమానె, పుష్కలంగా డబ్బున్న లక్షాధికారినైనా పెళ్లి చేసుకోవా లన్న తన కోరిక నెరవేరలేదూ? అబ్బాయిని క్లబ్బూ, పేకాటా, నాటకాలూ వీటి నుంచి ఇంక తప్పించలేం అని అత్తామామా నిరాశ చేసుకొన్నాక తన వాకచక్యం అంతా ఉప యోగించి ఆయన్ని దుర్వ్యసనాల్లోంచి తప్పించి, తన వాడిగా చేసుకోలేదూ? పాపే మిగా వీల్లేదు అన్న ఆయన చేతే తన అభిరుచులకి అనుగుణంగా అందమైన, ఈ మేడని కట్టించలేదూ? ఈ నలుగుని తన కప్పగించి ఆయన శాశ్వతంగా కళ్ళు మూశాక "ఆ!.. శారదాంబ ఇంత ఆస్తినీ నిలబెట్టుకుంటే చూద్దాంలే'' అన్న చుట్టాల చేతే, అయిదేళ్ళు తిరక్కుండా "ఏమైనా శారదాంబ ఘటికురాలు'' అంటూ ప్రశంసలు పొందలేదూ? "ఆడదానివి, మగపిల్లవాడిని పాడైపోకుండా పెంచడం మాటలు కాదు.'' అన్న చుట్టుపక్కల వాళ్ళు ఆశ్చర్యంతో ముక్కు మీద వేలేసు కునేలాగ పెంచలేదు తనూ రాంబాబుని ?

ఇలా జీవితంలో తను ఏది సాధించలేదు కనక? తన ఆలోచనలన్నీ నెరవేరి ఈ రోజున బుద్ధిమంతుడని ఇటు వూళ్లోనూ, తెలివైనవాడు అని అటు కాలేజీలోనూ రాం బాబు పేరు తెచ్చుకుంటూంటే తన హృదయం సంతృప్తితో ఎంతగా నిండి పోయి ఆనందంతో కళ్ళు ఎలా చెమరు స్తున్నాయి!.. ఏదో భగవంతుడి దయవల్ల అంతా సక్రమంగా జరిగిపోయింది ఇంక ఎటొచ్చీ అందమూ, గుణమూ, తెలివి తేటలూ అన్నీ ఉన్న ఒక అమ్మాయిని తీసుకు వచ్చి వాడికి పెళ్లి చెయ్యాలి. ఈ ఒక్క విషయంలోనూ కూడా తన ఆలోచన నెరవేరి, తనకి నచ్చిన పిల్లని కనక వాడికి పెళ్లి చెయ్యగలిగితే, నెగ్గేసినట్లే. జీవి తంలో తను కోరే కోరికలేం లేవు ఇంక. ఈ ఒక్క సందర్భంలో కూడా పందెం సరిగ్గా పడేలా వేసి, శారదాంబ ఆఖ ఈ పావుని జీవితపు పచ్చీసులో పండి...

# పోవాలుపందెం వచ్చిను

చెయ్యి భగవంతుడా!

ఇలా అనుకుంటూ శారదాంబ అరుగు మీదకి వచ్చింది రాంబాబు వస్తున్నాడేమో చూద్దాం అని. ఊహు! తక్కిన తోటి కాలేజిపిల్లలంతా గంటక్రితమే వచ్చేశారు. వీడింకా ఎందుకు రాలేదు చెప్మా! కంగారు పడతూ ఏమీ తోచక ఇంట్లోకీ వీధిలోకీ తిరుగుతోంది శారదాంబ. వంటింట్లో రాంబాబు కని చేసిన టిఫెను చల్లారి పోతోంది. హాల్లో ఉన్న గోడ గడియారం అయిదు కొట్టి టిక్‌టిక్ మంటూ ముందుకు సాగిపోతోంది. వంటింటికీ హాల్లోకీ మధ్య తచ్చాడుతూన్న శారదాంబ మనస్సు చెయ్యి భయాలతో వేగిపోతోంది. "ఎప్పుడూ లేంది ఇంత ఆలస్యం అయిందేమిటి? అవతల ఏం రాచకార్యాలు మునిగిపోతున్నాయని?.. రానీ.. కనుక్కుంటాను." శారదాంబకి కోపం విసుగూ ఎక్కువ కాసాగాయి.

ఓమారు వెళ్ళి వీధి మొగలోకి తొంగి చూసింది. రాంబాబు అయితే రావడంలేదు. కాని ఓ పదిహేడు పద్దెనిమిదేళ్ళ ఓ అమ్మాయి విలాసంగా పుస్తకాలు పుచ్చుకొని వయ్యారంగా నడిచి వస్తోంది. తన ఇల్లు దాటి ముందుకి వెళ్ళిపోయే దాకా రెప్పవాల్చకుండా ఆ అమ్మాయి కేసే చూస్తూ ఉండిపోయింది శారదాంబ. "ఎంత అందమైన పిల్ల! చక్కని ముఖం, తీర్చిదిద్దిన ముక్కూ, పెద్దపెద్ద కళ్ళూ బారెడు జడా, కట్టుకున్న ఆ లేతగులాబీ రంగు జార్జెట్ చీరలోంచి కాంతి వెదజల్లుతూన్న పచ్చని శరీరచ్ఛాయ, చక్కగా తీర్చిదిద్దినట్లున్న అవయవ సౌందర్యం. ఎవరమ్మాయి చెప్మా?.. ఇంత క్రితం ఎప్పుడూ చూడలేదే!.. కొత్తగా వచ్చారేమో. ఏమైనా రత్నం లాంటి లక్షణమైన పిల్ల. ఎవరి కోడలవుతుందో కాని."

ఇలా అనుకుంటూ ఇటు తిరిగిందో లేదో, ఎప్పుడు వచ్చాడో ఏమో రాంబాబు కూడా తన పక్కనే వచ్చి నిలబడి, తనలాగే, వీధి చివర పాలపిట్ట రంగు శాలాలోకి వెళుతూన్న ఆ అందమైన అమ్మాయి కేసే రెప్పవాల్చకుండా చూస్తున్నాడు. ఆస్థితిలో రాంబాబుని చూసేసరికి శారదాంబ గతుక్కుమంది. వెంటనే "ఏమిటలా నిలబడిపోయావే! లోపలికి నడు" అంటూ, గట్టిగా కసిరింది.

ఆ రాత్రి భోజనాల దగ్గర వక్తృత్వపు పోటీలలో పాల్గొనడం వల్ల తను పాద్యం త్రం పెందరాళే రాలేకపోయాడన్నీ తనకో ప్రైజు రాలేదుకాని, సాయంత్రం ఆ పాలపిట్ట రంగు ఇంట్లోకి వెళుతున్న అమ్మాయి అత్యద్భుతంగా మాట్లాడి ఫస్టు ప్రైజు కొట్టేసిందనీ, ఆ అమ్మాయి ఈమధ్యనే కాలేజీలో కొత్తగా జేరిందనీ వాళ్ళ నాన్నగారు కొత్తగా ఈ పక్కనున్న పల్లెటూరికి బి. డి. వో.గా ట్రాన్స్‌ఫర్ అయి వచ్చారనీ రాంబాబు అంతా సవిస్తరంగా చెబుతూ ఉంటే శారదాంబ పైకి స్థిమితంగా వింటున్నట్లు కనిపించినా మనస్సులో మాత్రం మహా కళవళ పడసాగింది.

రాంబాబు ఎప్పుడూ లేంది ఆ రోజు సాయంత్రం ఆలస్యంగా రావడం, అదికూడా ఆ అమ్మాయి వెనకాలే రావడం, అమ్మతో మాట్లాడుతున్నాం అన్నైనా ధ్యాసలేకుండా ఆ అమ్మాయి తెలివితేటల్ని విపరీతంగా పొగడడం, అంతటితో ఆగక వాళ్ళు ఎప్పుడొచ్చారో ఏవూరు, వాళ్ళ నాన్నగారికి ఏంపనో ఈ వివరాలన్నీ సేకరించడం.. ఇదంతా ఒకచోటుకి జేర్చి చూస్తే తను వెంటనే మేలుకొని జాగ్రత్త పడవలసిన అవసరం ఎంతయినా కనిపించింది శారదాంబకి.

అవును. వయస్సులో ఉన్న కుర్రాడు. పాటి ఆడదయి ఇంత వయస్సు వచ్చిన తనకే ఆ అమ్మాయి అందం ఆశ్చర్యాన్ని కలిగిస్తే ఇంక కుర్రమోహం వాడి మాట చెప్పాలా?... అయినా ఇంత క్రమశిక్షణలో పెరిగిన రాంబాబు ఇలా చప్పుని ఆ పిల్ల వ్యామోహంలో పడిపోతాడా? ఇన్నాళ్ళూ తను చాకచక్యంగా పెంచిన పెంపకంలోని బలం ఇంతే! ఆ అమ్మాయి ఒక్కరోజు చూపిన చూపుతో తన ఇన్నేళ్ల శ్రమా వ్యర్థం అయిపోవడమే! అంతటి శక్తిమంతురాలా ఆ అమ్మాయి! చూద్దాం.

తను మళ్ళీ ఈ వయస్సులో వచ్చేను బల్ల దగ్గర కూచుని తెలివివి పందెం వేసి చాకచక్యం పొన్నలు నడపవలసిన అవసరం ఏర్పడింది అని అనుకుంది శారదాంబ.

మర్నాటి నుంచీ ఆ అమ్మాయి మీద ఒకకన్నేసి ఉంచసాగింది శారదాంబ. కాలేజీ అలా వదలగానే ఇలా వెంటనే ఇంటికి రావాలనీ, కావలిస్తే సైకిలు ఒకటి కొనుక్కోమనీ, అయిదు నిముషాల ఆలస్యాన్ని కూడా సహించేది లేదనీ ఖచ్చితంగా చెప్పి, మర్నాడే సైకిలు ఒకటి కొని ఇచ్చింది

దీంతో నడిచే ఆ అమ్మాయి, సైకిలు మీద వచ్చే వీడితో విలాసంగా కలిసి వచ్చే అవకాశం పోతుంది కదా. ఈ ఆలోచన తనకి బాగానే వచ్చింది అని సంతోషించింది శారదాంబ. రోడ్డు వెంబడి ఆ అమ్మాయి వెళుతూ ఎప్పుడేనా తన మొహం ఎత్తి చూస్తే ఆమె కళ్లల్లోకి కళ్లు పెట్టి కొరకొరా చూడడం ద్వారాను, మేడ మీంచి రాంబాబు గదిని పెరటి సావిడిలోకి మార్చడం ద్వారాను, శారదాంబ కొంతవరకూ తన కార్యక్రమానికి అవసరమైన జాగ్రత్తలు తీసుకొంది.

తన ప్రయత్నాలు ఎంతవరకు ఫలప్రదమయ్యాయో తెలుసుకోవడం కోసం వారం పదిరోజులు పరిస్థితుల్ని జాగ్రత్తగా పరిశీలించింది. ఫరవాలేదు. వాతావరణంలో మార్పు వచ్చింది. రాంబాబు తిరిగి పూర్వం లాగ బుద్ధిగా కాలేజీకి వెళ్లి వస్తున్నాడు. కొత్తగా సైకిలు ఒకటి రావడం మూలాన కాలేజీకి అయిదు నిముషాలు టైము ఉండగా వెళ్లడం కాలేజీ వదిలిన అయిదు నిముషాల్లో రావడం చేస్తున్నాడు. ఇంటికి వచ్చాక ఇంక వాడిని తను ఇల్లు కదల నీయడం లేదేమో, ఇంక ఆ అమ్మాయి ప్రభావం తన కొడుకు మీద పడుతుందనే భయం శారదాంబకి పోయింది.

"అయితే తను ఎన్నాళ్లని రాంబాబుని ఇలా జాగ్రత్తగా దాస్తుంది ఆ పిల్ల బారి పడకుండా. అసలా అమ్మాయిలోనే మార్పు తీసుకురావాలి. మన వేషాలేం సాగవు అని ఆ అమ్మాయి గ్రహించే లాగ చెయ్యాలి. "శారదాంబగారి రక్షణలో ఉన్న రాంబాబు నాకు అందని ఫలం అందుకు అర్రులు చాచడం కూడా ప్రమాదకరం" అని ఆ పిల్లకి తెలిసిరావాలి. వస్తుంది. వచ్చేలాగ తను చేస్తుంది జీవితంలో ఎన్ని సాధించలేదు? ఇదొక లెక్కా? అనుకొంది."

ఓరోజున ఇలా శారదాంబను అనుకుంటూ వంటింట్లో కాఫీ కలుపుతూండగా, వీధి గుమ్మంలో ఏదో రిక్షా ఆగినట్టయింది. వీధిలోకి తొంగి చూస్తే, ఆ అమ్మాయి రిక్షాలో కూచుని ఉంది, అప్పుడే రిక్షా పక్కని సైకిలు దిగి రాంబాబు —"ఇదే మా యిల్లు" అని ఆ అమ్మాయికి చూపిస్తున్నాడు. ఆ అమ్మాయి 'ఆహా. వెళ్తొస్తా' అంది. రిక్షా కదిలింది.

శారదాంబ ఒక్కక్షణం ఆ పట్టున అలాగే ఉండిపోయింది. కాళ్ల కింద భూమి కదిలినట్లయింది. ఇన్నాళ్లూ శ్రమపడి తను ఎంతో చాకచక్యంగా నిర్మించానని గర్వపడుతున్న పరిరక్షణ కోట తన కళ్ల ముందే కూలిపోతున్నట్లు అనిపించింది. తనంటే రాంబాబుకి ఉన్న భయాన్ని కూడా పోగొట్టేసి అటువైపుకి ఆకర్షించుకోగల ఆ అమ్మాయి సామాన్యురాలిలా అనిపించలేదు శారదాంబకి. పెద్దపెద్ద గడ్డు సమస్యల్ని సునాయాసంగా పరిష్కరించగలిగిన తనకి ఈ పిల్ల తెగని సమస్యగా తయారయింది. ఏమిటి? ఈ వ్యవహారం ఏదో గట్టిగా చూస్తే కాని వీలులేదు. ఈ అమ్మాయి ఆట కట్టించాలి.

ఏమిటో తను అనవసరంగా ఆందోళన పడుతోంది కాని ఇది ఒక పెద్దసమస్యా తనకి? సరిగ్గా తలుచుకుంటే ఒక్కరోజులో అన్నీ చక్క చేయగలదు. అవును. ఒక్క రోజు చాలు.

ఇలా అనుకొని ఆ రోజునే రాంబాబుతో ఖచ్చితంగా చెప్పింది "ఆడపిల్లల తోటి స్నేహం ఏమిటి నీకు? నువ్వు మంచివాడివే కావచ్చు. నీది నిష్కళంక ప్రవర్తనే కావచ్చు. అయినా ఆ పద్ధతిని లోకం ఒప్పుకోదు. నేనూ ఒప్పుకోను. నీకిదే చెప్పడం. బుద్ధిగా కాలేజీకి వెళ్లివస్తావా, రా. లేదా చదువు మానేసి ఇంట్లో కూచో. మళ్లీ ఈ వేషాలు ఎప్పుడేనా వేశావా ఆ రోజుతో నీ చదువు ఆఖరు. జ్ఞాపకం ఉంచుకో."

ఇలా చెప్పనట్లు చెప్పినా శారదాంబ ఉద్దేశం ఏదో రాంబాబుకి అర్థం అయింది. అందుకే సమాధానం ఏం చెప్పకుండా ఊరుకున్నాడు. అమ్మ కోపం తెలుసు రాంబాబుకి.. ఏదైనా అందీ అంటే ఆ పని చేసితీరుతుంది. అందుకే తన చదువు ఎక్కడ మానిపించేస్తుందో అని హడలిపోయాడు.

జాగ్రత్త కోసం కొడుకు నిలా హెచ్చరిక చేసి భయపెట్టినా, నిజానికి శారదాంబ కోపం అంతా ఆ అమ్మాయి మీదే ఉంది. గట్టిగా ఆ పిల్లనోమారు మందలించి తీవ్రంగా హెచ్చరించాలి. తన హొయలు చూపి రాంబాబుని వశం చేసుకుంటూంటే, చేతకాని దానిలాగ చేతులు ముడుచుకుని కూచునే వ్యక్తి కాదు వాళ్లమ్మ అని ఆ అమ్మాయికి తెలియజెప్పాలి.

పిలిచి చీవాట్లు పెడితే! ఉహూ! అంతటితో భయపడి తప్పుకొనే రకంలా లేదు.

పోనీ వాళ్ల ఇంటికి వెళ్లి తల్లిదండ్రులతో "ఇదిగో మీ అమ్మాయి వూళ్లోఉన్న మొగపిల్లల తల్లులందరికీ ఒక సమస్య అయి కూర్చుంది. అదుపులో పెట్టుకోండి మీ అమ్మాయిని" అనిహెచ్చరిస్తే.. బాగానే ఉంది. వాళ్లు ఎదురుతిరిగి "మీకు ప్రత్యేకం మా అమ్మాయి కల్గించిన ఇబ్బంది ఏమిటి చెప్పండి" అంటే తనేం చెబుతుంది? తన కొడుకుతో ఆ అమ్మాయి షికార్లు కొట్టిందా? సినిమాల కెళ్లిందా? వూరు వదిలిపోయిందా? ఉత్తరాలు మొదలెట్టిందా? ఇదీ అని చెప్పడానికి బుజువుకి వచ్చే నేరం ఆ అమ్మాయి ఏం ఉంది? నిజానికి ఆ అమ్మాయి పద్ధతి చూస్తే ఈ అన్నిటి కంటే ప్రమాదకరంగానే కనిపిస్తోంది. కాని అదే నేరమని మనం ఎంత గాఢంగా నమ్మినా ఇతరులని ఒప్పించలేం కదా! పైగా అనవసరపు భయం పడుతున్నట్లు చూసి హేళన చేస్తే!

అయితే అది లాభంలేదు.

పక్కింటి మంత్రిసీళ్ల బామ్మగారు తరుచు వాళ్ల ఇంటికి వెళుతూ ఉంటుంది. ఆవిడ దగ్గర ఆ అమ్మాయి ప్రస్తావన తీసుకువచ్చి చల్లగా చెప్పీ చెప్పనట్లు అంటిస్తే సరి. ఆవిడ నోట్లో నువ్వుగింజ నానదు. వాళ్లకి ఆవిడ అందిస్తుంది. దాంతో వాళ్లకి అర్థం అయి అమ్మాయిని అదుపులో ఉంచుతారు. అమ్మాయి ఆట ఇంచక్కా కడుతుంది.

అనుకున్నట్లు చేసి, మర్నాడు ఆ అమ్మాయి ప్రవర్తనని పరిశీలిస్తే, ఒక్క పందెంతో ఆ అమ్మాయి పంటకాయిని చంపినంత ఆనందించింది శారదాంబ. రోజూ లాగ ఆ అమ్మాయి నడకలో విలాసంలేదు. విసవిసా నడుస్తోంది. మధ్యలో తనకేసి ఓమారు కోపంగా కూడా చూసింది. ఇది చూసి శారదాంబ కళ్లు విజయగర్వంతో విస్ఫారితా లయ్యాయి. 'శారదాంబ అంటే మరేమిటి అనుకున్నావ్' అన్నట్లు ఆ అమ్మాయికేసి వోమారు చూసింది.

తర్వాత వారంపది రోజులు దాకా శారదాంబకి సంతృప్తికరంగానే కనిపించాయి పరిస్థితులు. ఇటు రాంబాబు కాని అటు ఆ అమ్మాయి కాని ఒకరి ధ్యాస ఒకరు పట్టించుకుంటున్నట్లు లేదు. ఎవరి మార్గాన వాళ్లు కాలేజీకి వెళుతున్నారు. వస్తున్నారు. ఇద్దరూ కలిసికొని ఒకరి వెనకాల ఒకరు కాని రావడంలేదు. రాంబాబు కూడా ఆ అమ్మాయి ప్రస్తావన మాటవరసకైనా ఎత్తడం మానేశాడు. 'మావాయనకి నా మాట మీద గౌరవం ఉంది' అనుకొంది శారదాంబ.

అసలు మొదటినుంచీ రాంబాబు నిర్దోషే నేమో, తనే అనవసరంగా లేనిపోని అనుమా

[illegible]
ఏమో!.. ఏమైతేనేం పరిస్థితులన్నీ చక్కబడి ఇప్పుడు అంతా సవ్యంగా ఉంది..ఆ.. తన కంగారు కాని ఉండకేం జేస్తుంది? తన ప్రయత్నం ఎప్పుడు విఫలమైంది కనక ?

వీధి గుమ్మం దగ్గర పడక కుర్చీలో కూర్చుని శారదాంబ ఏ రోజున తియ్యగా ఆలోచించుకుంటూ ఉంటే, కోపం వల్ల ఎర్రగా జేవురించిన ముఖంతో, కళ్ళు ఇంతింత చేసుకొని, మెట్లెక్కి తన దగ్గరికి తుఫాన్‌లా వచ్చింది ఆ అమ్మాయి. శారదాంబ ఆశ్చర్యం లోంచి తేరుకొనేలోగానే "రాంబాబు తల్లి మీరే అనుకుంటాను.. మీ అబ్బాయిని కొంచెం అదుపాజ్ఞల్లో పెట్టుకోండి. ఈ మాటు మళ్లీ ఇతనల్లా ప్రవర్తించాడంటే మర్యాద దక్కదు" అంది. ఆ అమ్మాయి ఆవేశాన్ని అదుపులో పెట్టుకోడానికి ప్రయత్నం చేస్తూ. శారదాంబకి ఏం అర్థంకాక ఒక్క క్షణం నిశ్చేష్టురాలయి అలా నిలబడి ఉండిపోయింది. కాస్సేపటికి తేరుకొని తాపీగా "ఏం జరిగింది?" అంది.

"అది మీ సుపుత్రుడిని అడిగి తెలుసుకోండి"

"అలాగే అడుగుతా. నీ కింత పౌరుషం రావడానికి వాడేం చేశాడని?"

"ఏం చేశాడా?.. మా ఇద్దరికీ ఇంత క్రితం ఏదో పరిచయం ఉన్నట్లు కులాసాగా ఉన్నారా అని నడివీధిలో పలకరిస్తాడా?"

"మీ ఇద్దరికీ అసలు పరిచయం లేదూ?" అంది శారదాంబ రెక్కిస్తూ.

"ఏముంది? ఆమధ్య నెప్పుడో నేను రిక్షాలో వస్తూంటే ఆ రిక్షా తిరగబడబోయింది. అప్పుడాయన ఆదుకొన్నారు. మర్యాద కోసం ఆ రోజున థాంక్స్ చెబితే అది అలుసు తీసుకుని ఇవాళ అకారణంగా పలకరిస్తాడా?" అంది ఆ అమ్మాయి అసలే పెద్దవైన తన కళ్లని మరింత పెద్దవి చేస్తూ.

"ఓస్ ఇంతే కదా ?" అంది శారదాంబ దాన్ని తేలిగ్గా తీసేస్తూ.

"ఏమిటి అంతే!.. ఇలా పరిచయంలేని వ్యక్తుల్ని పలకరించడం మీ ఇంట్లో అలవాటయితే అవొచ్చు మా ఇళ్లల్లో మాత్రం మేం భరించం. గౌరవం అయిన కుటుంబం మాది" అంటూ పైట బొడ్డులో దోపుకొని కోపంతో విసవిసా వెళ్లిపోయింది ఆ అమ్మాయి.

ఆ అమ్మాయి అన్న చివరి మాటకి మనస్సు చివుక్కుమన్నా శారదాంబ ఒకందుకు సంతోషించింది. ఆ అమ్మాయికీ

## [illegible]

రాంబాబుకీ ఏం పరిచయంలేదు ఇంతవరకు, అని ఒకటి తెలిసింది. రిక్షాలో వచ్చిన రోజున వాళ్ళు మాట్లాడుకోవడం తనూ చూసింది. వీళ్ల పరిచయం అంతటిదే అన్నమాట! అయితే ఆ అమ్మాయి రాంబాబుని ఆకర్షించడానికి ప్రయత్నం చేస్తోందేమో అని తను ఇన్నాళ్ళూ పడిన భయం. అందుకోసం తనువేసిన ఎత్తులు, చేసిన ప్రయత్నాలు, అన్నీ అనవసరం అన్నమాట. ఆ అమ్మాయేం రాంబాబు కోసం పాకులాడుతున్నట్లు లేదు ఆ మాటల వరస చూస్తే. ఇంకా వీడికే ఆ అమ్మాయి మీద దృష్టి ఉంది. ఇంక తను ఆ అమ్మాయి మీద కక్ష కట్టవలసిన అవసరం ఏం ఉంది? ఏంలేదు..

అయితే అందమైన దాన్ని. తెలివైన దాన్ని చురుకైన దాన్ని అని ఓ గర్వం ఉంది ఆ అమ్మాయికి. పైగా వాళ్లదే మర్యాదైన కుటుంబంట. ఇవతల వాళ్లది కానట్టు. కుర్రాడు పలకరించాడు అని ఎంత పౌరుషం వచ్చింది? పలకరిస్తే తప్పేమిటి? తన హోదా ఏం ఎక్కువదా?..వాడి తాహతు కంటే గొప్పదేమిటి తన తాహతు. అసలు వాడి తాహతు లాంటివాడు తనకు దొరకొద్దూ! ఆ పిల్ల గర్వం తగ్గాలంటే ఎవరినైతే తృణీకరించిందో వాడికే ఇచ్చి పెళ్లి చెయ్యాలి. దాంతో ఆ గర్వం కాస్తా చప్పగా అణుగుతుంది. చూస్తాను. దీని గర్వం ఏమిటో? రాంబాబుని గడ్డిపరకలా తీసేసి అలా అవమానించడం ఏమిటో! పట్టుదల పట్టైనా ఇలాంటి రత్నం లాంటి పిల్లని తన ఇంటికోడలిని చేసుకోవాలి. శారదాంబ జీవితపు ఆటలో పావులు పేర్చి పందేలు ప్రారంభించింది. ఈమాటూ తన ప్రత్యర్థి ఆ అమ్మాయే! కానయితే పావుల్ని నడిపే మార్గం మాత్రం మార్చింది.

మాట వరసకి అబ్బాయి దగ్గర ఆ అమ్మాయి ప్రస్తావన ఎత్తింది తాడి ఎత్తున చిర్రున లేస్తూ "ఆపిల్ల మాట నాదగ్గర ఎత్తకు" అన్నాడు రాంబాబు.

తనలో తను నవ్వుకుని ఏం ఎరగనట్టు "ఏం?" అంది

"తనే పెద్ద అందగత్తెనని ఒళ్లంతా గర్వం."

రాంబాబు సమాధానంతో శారదాంబకి అతని హృదయం అర్థం అయింది. ద్విగుణీకృత ఉత్సాహంతో కార్యరంగంలో ప్రవేశించింది. ఆ అమ్మాయి తల్లితో పరిచయం చేసుకోవడం కోసం అమ్మాయి వాళ్ళ నాన్న ఇంట్లో ఉండని మధ్యాహ్న సమయం చూసి మంచినీళ్ల బామ్మగారిని సాయం తీసుకుని వాళ్ళ ఇంటికి వెళ్లింది. కాసేపు అవీ ఇవీ కబుర్లు చెప్పి వచ్చేస్తూండగా గోడని ఉన్న పెద్ద ఫోటో ఒకటి చూసి తెల్లబోయి నిలబడిపోయింది శారదాంబ. శారదాంబను చూసి "అదేమిటి అలా తెల్లబోతారు! ఆయనే బి. డి. వో. గారు. అమ్మాయి నాన్నగారు" అంది మంచినీళ్ల బామ్మగారు తనలో జనించిన తత్తరపాటు పైకి కనిపించనీయకుండా "అహా... ఎక్కడో చూసినట్టు ఉంటేనూ" అంటూ శారదాంబ వచ్చేసింది.

ఆ అమ్మాయి కేశవరావు కూతురు అని తెలిసిన తర్వాత రాంబాబుకి ఆ అమ్మాయిని ఎలాగైనా పెళ్లి చెయ్యాలనే పట్టుదల శారదాంబలో అధికం కాసాగింది. ఆ రోజున తనను చేసుకోడానికి బెట్టు చేసిన కేశవరావు ఇవాళ తన కొడుకు కాళ్ళు కడిగి నెత్తిన జల్లుకుంటే తనకంత కంటే కావలసినది ఏమిటి? జీవితపు పందెంలో కేశవరావుతో కూడా తను నెగ్గినట్టే కదా?

అమ్మ చేస్తున్న ప్రయత్నం విని రాంబాబు "ఆ పిల్లని నేను చేసుకోను" అన్నాడు. "పెంకిపిల్ల" అన్నాడు. "ఇది తప్ప ఇంకేం చెప్పినా వింటాన"న్నాడు. "దూరం ఆలోచించ"మన్నాడు. "పెళ్లి విషయంలో ఇంత బలవంతం న్యాయం కాద"న్నాడు. "నా మెడలువంచి ఒప్పిస్తావు కాని, ఆ అమ్మాయిగా, వాళ్ల తల్లి తండ్రులూ ఒప్పుకోవద్దూ?" అన్నాడు చివరికి.

"ఎందుకు ఒప్పుకోరూ? లక్షలు పెడితే మాత్రం వాళ్ళకి మనలాంటి సంబంధం దొరకవద్దూ? చూడు ఎంత చాకచక్యంగా వ్యవహారం నడిపి వాళ్లను ఒప్పిస్తానో?" అంది శారదాంబ.

అన్నట్టే చేసింది.

కేశవరావుగారి ఇంటికి తాను రోజుకో మాటైనా వెళ్లివస్తోంది కాని మాట వరసకేనా తనకు తానై పెళ్లి ప్రస్తావన ఎత్తడంలేదు. అలా గని ఊరుకొందా? వాళ్ల చేతా వీళ్ల చేతా చెప్పించింది. మధ్యవర్తుల చేత పురి ఎక్కించింది. మూచాయగా తన ఆస్తి వివరాలు అందిం

టింది. రాంబాబు రత్నంలాంటి కుర్రాడనే సంగతి వాళ్ళకి చేరేలాగ చేసింది. పళ్ళూ ఫలాలూ వస్త్రాలు తరుచు పంపుతూ తన మంచితనాన్ని రుజూచూపించింది. కబుర్ల ధోరణిలో "తమకి కట్నం ఆశ లేదనీ పిల్ల లక్షణంగా ఉంటే చాలనీ" చెప్పింది. అమ్మాయి పెట్టు చేస్తోందని తెలుసుకుని ఆమె స్నేహితురాండ్ర ద్వారా చెప్పించి అప్పుడప్పుడు ఆ అమ్మాయికి జడ వేస్తూ కబుర్లు చెప్పి పువ్వులూ పళ్ళూ ఇస్తూ అమ్మాయి అడ్డు లేకుండా చేసింది. ఇలా తన తెలివితేటలన్నీ ఉపయోగించి కేశవరావు భార్యచేత అడిగించుకుని పెట్టు చేసినట్టు మొదట నటించి చివరికి ఒప్పుకుంది శారదాంబ, తన కొడుక్కి ఆ అమ్మాయిని చేసుకోవడానికి..

ఇలా అన్నీ సవ్యంగా జరిగి రాంబాబు ఆ అమ్మాయి మెడలో తాళి కడుతున్నపుడు ఆటంకాలన్నీ తప్పించి తన పంతం నెగ్గించి తను అనుకున్న అమ్మాయితో రాంబాబు వివాహాన్ని జరిపించిన భగవంతుడికి మనసార కృతజ్ఞత అర్పించుకొంది శారదాంబ.

కోడలు కాపురానికి వచ్చిన మొదటిరాత్రి తన మకాముని గదిలోంచి హాల్లోకి మార్చిన శారదాంబ ఏం తోచక పచ్చీసు బల్ల ముందు కూచుని ఒక్కతే పందేలేస్తూ ఆడుతోంది. ఎదురుగుండా కోడలు ఆడుతోందని వూహిస్తూ ఆమె పందేలు కూడా తనే వేసి పావులు కూడా తనే కదుపుతోంది. ఇంతలో అనుకోకుండా కోడలికి మంచి పందెం పడి ఆమె పావు పండింది.

కలలో కూడా ఓటమి ఎరుగని శారదాంబ తెల్లబోయి పండిన పావుకేసి చూస్తోంటే, ఆ పావు ఆమెకేసి చూసి నవ్వినట్లు అనిపించింది. ఆ నవ్వుతో గదిలోంచి వినిపిస్తున్న కోడలి నవ్వు కూడా శ్రుతి కలిపింది. ఆ నవ్వులో తన ఓటమి ఏదో ధ్వనించినట్లయి "అబ్బాయి పెళ్లి విషయంలో నేనే నెగ్గాను. ఏమైనా సరే వాళ్ళ పావులే ఓడాయి" అని అరిచింది శారదాంబ వీరావేశమైన కంఠంతో నిస్సహాయురాలై. "నీకీ పెళ్లి ఇష్టం లేనట్టు నాటకం ఆడావు?" అంటే, "మీరు మాత్రం?" అంటూ తమలపాకులు వేసుకుంటూ, గదిలో కొడుకూ కోడలూ కూడా, తను తన గురించి సరిగ్గా అదే అనుకుంటూ, నవ్వుకుంటున్నారని ఏం తెలుసు పాపం శారదాంబకి!

# వారఫలం

**7-4-1967 శుక్రవారం మొదలు**
**13-4-1967 గురువారం వరకు.**

**మేషం** వారం ప్రారంభంలో వృత్తి వ్యాపారల్లో చికాకులు ఏర్పడి తరువాత సర్దుకొంటాయి. కొన్ని వ్యవహారల్లో అధికవ్యయం జరుగడం వలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది. ప్రయాణాలు ఫలిస్తాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారల్లో కర్యభారం పెరుగుతుంది. పుణ్యకర్యాలు చేస్తారు.

**వృషభం :** వృత్తి వ్యాపారల్లో మీ కర్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. సాహసముతో కూడిన వ్యవహారలు కూడా లాభించగలవు. వారం మధ్యలో చికాకులు ఏర్పడతాయి. మీ తాలూకు వస్తువులు పోవచ్చును. విద్య వైజ్ఞానికరంగాల్లో మీ కృషి రాణించగలదు.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. అలంకర వస్తువులుకొంటారు.

**మిధునం.** వ్యాపారంలో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి వస్తుంది. అధికారులవలన జరగవలసిన వ్యవహారాల్లో మిత్రుల సహకారం లభించగలదు. ఉద్యోగంలో గౌరవం బాగా ఉంటుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు సంతృప్తికరంగా ఉంటాయి. వినోద కలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం :** ఇదివరకు మీకు ఆందోళన కలిగించిన వ్యవహారల్లో అనుకూలతలభిస్తుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణంద్వారా కార్యసాధన చేయగలరు. సాహిత్య కళారంగాల్లో మీకృషి రాణించగలదు. రాజకీయ వ్యవహారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానేవుంటుంది. శుభకర్యాల విషయంలో అనుకూల వర్తమానవింటారు.

**సింహం :** కొన్నివ్యవహారల్లో మీరు ఎంత మంచిగా ప్రవర్తించినా, అది యితరులకు చెడుగానే కన్పిస్తుంది. సాహసముతో కూడిన వ్యవహారల్లో జోక్యం చేసికోవడం తగదు. ప్రయాణాలు వారంమధ్యలో ఫలిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు.

స్త్రీలకు—కుటుంబ వ్యవహారల్లో కర్యభారం పెరుగుతుంది. పుణ్యకర్యాలు చేస్తారు.

**కన్య :** ఏ వ్యవహారంలోను ఆరంభంలో కనుపించిన అనుకూలత ఆఖరువరకు నిలవదు. వృత్తిలో ప్రయోజనంగల వ్యక్తులను కల్సుకొంటారు. ఆర్థిక వ్యవహారాలు వారం ప్రారంభంలో బాగా ఉంటాయి. వారం మధ్యలో చాలా చికాకులకు గురికాగలరు. పోటీవారితో గౌరవం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగా ఉంటుంది. వినోద కలక్షేపాల్లో పాల్గొంటారు.

**తుల** వ్యాపారంలో కొత్తవారితో పోటీని ఎదుర్కోవలసి వస్తుంది. ఇతరులమీద ఆధారపడి యే వ్యవహారమూ ప్రారంభించడం తగదు. అధికారులవలన జరగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరుతాయి. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. పోటీవారితో మాట పట్టింపులు రావచ్చును.

స్త్రీలకు— కుటుంబ వ్యవహారల్లో అధికవ్యయం జరుగుతుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**వృశ్చికం.** మీకు ముందు లాభించగల వ్యవహారాల్లో అనుకూలతను సాధించగలరు. సాహసముతో కూడిన వ్యవహారలు కొంతవరకు లాభిస్తాయి. అధిక వ్యయం జరగటంవలన ఆర్థికంగా ఒత్తిడి వస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది.

స్త్రీలకు— ఆరోగ్యం బాగా ఉంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లాభిస్తాయి.

**ధనుస్సు** వృత్తి వ్యాపారాల్లో కొంచం శ్రమ కలిగినా, దానికి తగిన ప్రతిఫలం లభించగలదు. కొన్ని వ్యవహారాల్లో మీ మంచితనమే మీకు ఇబ్బందిని కలిగిస్తుంది. ప్రయాణాలు ఫలిస్తాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. సాహిత్య కళారంగాల్లో మీ కృషి రాణిస్తుంది.

స్త్రీలకు— కుటుంబ కర్యక్రమాలు శ్రమమీద నెరవేరుతాయి. పుణ్యకర్యాలు చేస్తారు.

**మకరం :** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు ఫలించగలవు. సాహసముతో కూడిన వ్యవహారాలుకూడా ప్రోత్సాహకరంగా ఉంటాయి. వారం ఆఖరులో సామాన్యమైన వ్యవహారాలకు కూడా విశేషమైన ప్రయత్నం చేయవలసివస్తుంది. ఆర్థిక వ్యవహారలు సామాన్యంగా ఉంటాయి. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది.

స్త్రీలకు—ఆరోగ్యం సామాన్యంగా ఉంటుంది. విలాస వస్తువులు కొంటారు.

**కుంభం :** భాగస్వాములతో కలిపిచేసే వ్యాపారలు లాభిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. అధికారులవలన జరుగవలసిన వ్యవహారాల్లో అనుకూలత లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాలు బలహీనపడగలవు. మిత్రులకుసహాయం చేస్తారు.

స్త్రీలకు—కుటుంబవ్యవహారాలుసంతృప్తికరంగా ఉంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**మీనం :** వృత్తి వ్యాపారాల్లో ఇదివరకు యేర్పడిన చికాకులు తొలగిపోతాయి. ఆర్థిక వ్యవహారాలు వారంమధ్యలో బాగా ఉంటాయి. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. సజ్జనసాంగత్యం లభిస్తుంది.

స్త్రీలకు—ఆరోగ్యం బాగానే ఉంటుంది. శుభకార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

—మహేష్

# కొత్తనటి కుమారి రాధ



స్కూటర్ సరదా!

ఈ అమ్మాయి పేరు బి. వి. రాధ. తెలుగు సినిమా పరిశ్రమకు కొత్త అయినా తమిళ, కన్నడ రంగాలకు మరీ అంత కొత్త కాదు. నీతిక్కుపిన్ పాశమ్, వళికాట్టి, తాళంపూ, అమ్మా ఎంగే మొదలయిన తమిళ చిత్రాలలో వివిధ భూమికలు పోషించి రక్తి కట్టించిన కుమారి రాధ తెలుగువారి అమ్మాయి.

"ఆమె ఎవరు?" చిత్రం ద్వారా తెలుగు ప్రేక్షకులకు పరిచితురాలయినది రాధ. ఆ చిత్రంలో కథానాయకుడు శ్రీ జగ్గయ్య మొదటి భార్యగా నటించింది. అవకాశం వున్నంతవరకూ ఆ వేషానికి న్యాయం చేకూర్చేందుకు ప్రయత్నించిందనే విషయం ఆ చిత్రం చూసిన వారికి బోధ పడుతుంది.

కుమారి రాధ 1948 లో పశ్చిమ గోదావరి జిల్లా తణుకులో జన్మించింది. పుట్టడం అయితే అక్కడగాని పెరుగుదల అంతా బెంగుళూర్‌లోనే జరిగింది. ఆమె తండ్రి వ్యాపార రీత్యా బెంగుళూర్‌లో స్థిరపడటం వల్ల యీ అమ్మాయి కూడ అక్కడే వుండిపోవలసి వచ్చింది. బెంగుళూర్‌లోనే వుండి చదువుకుంటూ నృత్యాలలో శిక్షణ తీసుకున్నది.

సినిమాలకు సంబంధించిన నృత్యాలను రాజకుమార్ వద్ద అభ్యసించింది. సినిమాల్లో నటించాలనే కుతూహలం యీ అమ్మాయిలో మొదట్నించి ఉన్నది. అందుకోసం ప్రయత్నాలు చేసింది. "తెలుగు చిత్రాల కోసం ప్రయత్నిస్తే రాలేదు. తమిళ చిత్రనిర్మాతలు ఆదరణ కనపరిచారు. ప్రోత్సహించారు. లభించిన అవకాశాలను వినియోగించుకున్నాను నటించిన వాటిలో మంచి పేరే నాకు వచ్చింది. తమిళ చిత్రాలలో రాణించాక అయినా తన చిత్రాలలో నటించే అవకాశాలు వస్తాయేమోననే ఆశ నాలో ఎప్పుడూ మెరుస్తూ ఉండేది. మెదులుతూ ఉండేది. నా ఆశ నిరాశ కాలేదు. ఇపుడిపుడే మన తెలుగు నిర్మాతలు కూడ నా పట్ల ఆదరణ కనపరచి మంచి వేషాలు యిస్తున్నారు." అన్నది కుమారి రాధ.

బెంగుళూర్‌లో పెరిగినంత మాత్రాన యీ అమ్మాయికి తెలుగు రాదనుకుంటే ఆపోహ పడినట్లే అవుతుంది. తెలుగు, తమిళ, హిందీ, కన్నడ, ఆంగ్లభాషల్లో



ఆలోచన

టక్కని ప్రవేశమూ, పరిచయమూ వున్నది. 'గునా అవుర్ సజా' అనే హిందీ చిత్రంలో రాధ ఒక ముఖ్యభూమిక నిర్వహిస్తున్నది. ఈ చిత్రాన్ని నటుడు రంజన్ నిర్మిస్తున్నారు. ఆయనే నిర్మిస్తున్న తమిళ చిత్రం 'నాన్ యార్ తెరియుమా' 'నేనెవరో తెలుసా?'లో కూడ కుమారి రాధ ముఖ్యపాత్ర పోషిస్తున్నది. ఇంతవరకు పది తమిళ చిత్రాలలోను, అయిదు కన్నడ చిత్రాలలోను నటించిన రాధ "సుందర మూర్తి నయనార్" భక్తిరస ప్రధాన చిత్రంలో కథానాయికగా నటిస్తున్నది.

కుమారి రాధలోని ప్రజ్ఞను శ్రీదేవీ ప్రొడక్షన్స్ అధినేత శ్రీ తోట సుబ్బారావు గారు గుర్తించి—ఆయన నిర్మించనున్న కొత్త సాంఘిక చిత్రంలో కథానాయికగా బుక్ చేశారు. "భువన సుందరి కథ" విడుదలానంతరం యీ చిత్ర నిర్మాణం, ఆరంభమవుతుంది. పిటాడల్ స్టూడియోస్ వారు నిర్మిస్తున్న "ప్రేమలో ప్రమాదం"లో రాధ హాస్యభూమికలో కనిపిస్తుంది.

నటనతో పాటు నాట్యంలోను కుమారి రాధ ఎంతో అభివృద్ధిని సాధించింది. ఈమెకు డాన్స్ట్రూప్ ఒకటి వున్నది. సేలం, తిరుచ్చి, కుర్తాలం, కోయంబత్తూర్ మొదలయిన పట్టణాలలో నృత్య ప్రదర్శనాలు యిచ్చి, అసంఖ్యాకుల మెప్పులు బడసి, అనేక బహుమతులు అందుకున్నది. ఇప్పుడూ వీలున్నపుడల్లా నృత్యప్రదర్శనలు యిస్తూనే వున్నది.

తీరిక వేళల్లో స్విమ్మింగ్‌కి వెళ్ళడం, కొత్త నృత్యాలు ప్రాక్టీసు చేయడం, సంగీతం వినడం, స్నేహితులతో కబుర్లు చెప్పుకోవడం రాధకు యిష్టాలు. అనవసర ప్రసంగాల్లో జోక్యం కల్పించుకోవడం అతిశయోక్తులు పలుకడం, ఆడంబరాలకు పోవడం అయిష్టాలు. ఇంకా వీలుంటే స్కూటర్ మీద అలా షికారు వెళ్ళడమన్నా ఎంతో సరదా.

అందచందాలు, నటనలో ప్రజ్ఞ, నాట్యములో ప్రతిభ ఉన్న కుమారి రాధకు మన యితర నిర్మాతలు కూడ మంచి వేషాలు యిచ్చి ప్రోత్సహిస్తే వాటి పోషణలో రాధ తన బాధ్యతను నిలుపుకుంటుందని చెప్పడం అత్యుక్తి కానేరదు.

—మోహన్ కుమార్ ●


"చదరంగం"లో జమున.




విజయశ్రీ ప్రొడక్షన్స్‌వారి "పాండవుల బాల్యకథ" అను గజగౌరీ వ్రతం చిత్రం మార్చి 24వ తేదీ ఉదయం పదిన్నర గంటలకు సత్యా స్టూడియోలో ప్రారంభించారు. ప్రసిద్ధ నటుడు శ్రీ యన్. టి. రామారావు క్లాప్ కొట్టారు. శ్రీ జి. కామరాజు పూర్ణాపిక్చర్స్ అధినేత కెమెరా స్విచ్ ఆన్ చేశారు. అంజలీదేవి, జి. వరలక్ష్మి, కాంచన, కాంతారావు, ధూళిపాళ, బాలయ్య, ముక్కామల, పద్మశ్రీ నాగయ్య ముఖ్య భూమికలు పోషించే యీ చిత్రానికి కథ, సంభాషణలు, పాటలు సముద్రాల (జూనియర్) రాశారు. సంగీతం: టి. వి. రాజు కెమెరా: యు. రాజగోపాల్, కళ: వాలి, ఘోడ్‌గాంకర్, నృత్యాలు: హీరాలాల్; కూర్పు ఎన్. ఎస్. ప్రకాశం, దర్శకుడు; పి. సుబ్రహ్మణ్యం, నిర్మాతలు: పి. యస్. సూర్యనారాయణరాజు, కె. హనుమంతరావు.

* * *

విజయవర్ధన్ మూవీస్ వారు తమ తొలి ప్రయత్నంగా ఒక సాంఘిక చిత్రాన్ని నిర్మించనున్నారు. కృష్ణ, రామకృష్ణ, రామ్మోహన్, విజయనిర్మల, గీతాంజలి, గుమ్మడి, నాగభూషణం, రాజ్‌బాబు, కె. వి. చలం ముఖ్యపాత్రధారులు. కథ: యస్. బాలచందర్


'వసంతసేన'లో నాగేశ్వరరావు, కృష్ణకుమారి.



"చదరంగం"లో రమాప్రభ.

సంభాషణలు: సముద్రాల జూనియర్, గీతాలు: ఆరుద్ర, కొసరాజు, ఆత్రేయ, సంగీతం: కె. వి. మహదేవన్, కెమెరా: ఎం. కె. రాజు, కళ: తోట, నిర్మాతలు: పి. వెంకురెడ్డి, ఏ. రామిరెడ్డి, నృత్యాలు: కె. యస్. రెడ్డి, అసోసియేట్ డైరెక్టర్: కె.వి. రావు, కూర్పు, దర్శకత్వం: టి. కృష్ణ.

* * *

మార్చి 22న యీ చిత్రానికి సంబంధించిన ఒకపాట "చిన్నారి పొన్నారి చిట్టిపాపా, ఇన్నాళ్ళు ఏమైనావు చిట్టిపాపా" అనేది ఆరుద్ర రాయగా శ్రీమతి పి. సుశీల పాడగా విజయాగార్డెన్స్ థియేటర్‌లో రికార్డు చేశారు. సుశీల కోయిల స్వరానికి మహదేవన్ మధుర బాణీ తోడయితే ఆపాట ఇంపును, సొగసును వేరుగా రాయాలా?

* * *

యస్. వి. యస్. ఫిలిమ్స్ వారి నవ్వుల సాంఘిక చిత్రానికి "నిండు మనసులు" అని నామకరణం చేశారు. యస్. టి. రామారావు, దేవిక, ఎల్. విజయలక్ష్మి, రాజనాల, ధూళిపాళ, రమణారెడ్డి, సత్యనారాయణ, అల్లురామలింగయ్య, ఛాయాదేవి, వాణిశ్రీ, రాజబాబు ముఖ్య తారాగణం. ఇంతవరకు మూడు రీళ్ళ చిత్రం తయారయింది. మాటలు పినిసెట్టి, సంగీతం: టి. వి. రాజు, కళ: తోట, కెమెరా: యస్. యస్. లాల్, కూర్పు: బి. గోపాలరావు, దర్శకుడు: యస్. డి. లాల్, నిర్మాత: యం. జగన్నాథరావు.

ఇందిరా ప్రొడక్షన్స్‌వారి "రతీమన్మథ" చిత్రం యింతవరకు ఆరు రీళ్ళు పూర్తి చేసుకున్నది. కృష్ణకుమారి, యస్. వి. రంగారావు, కాంతారావు, శారద, రఘురామయ్య, ఆదోని లక్ష్మి ముఖ్యపాత్రలు ధరిస్తున్న యీ చిత్రానికి సంగీతం ఘంటసాల సమకూర్చుతున్నారు. యిటీవల దాశరథి రాసిన ఒక పాటను రికార్డు చేశారు. దర్శకుడు ఏ. నాగయ్యనాయుడు.

* * *

భరణీవారి "గృహలక్ష్మి" చిత్రం నిర్మాణం పూర్తి అయి రీ రికార్డింగ్ జరుపుకొంటున్నది. హాస్యరస ప్రధానమైన యీ చిత్రంలో పద్మశ్రీ భానుమతి, నాగేశ్వరరావు, యస్. వి. రంగారావు, పద్మనాభం, రాజబాబు, రావికొండలరావు, సూర్యకాంతం మున్నగువారు నటించారు. సంభాషణలు డి. వి. నరసరాజు బి. ఏ., సంగీతం యస్. రాజేశ్వరరావు, కళ రాజేంద్రకుమార్, కెమెరా: పి. నాగేశ్వరరావు, నిర్మాత, దర్శకుడు రామకృష్ణ. నవయుగ ఫిలిమ్స్‌వారి ద్వారా యీ చిత్రం ఆంధ్రలో ఏప్రిల్ మొదటివారంలో విడుదల కాగలదని తెలుస్తున్నది.

* * *

శ్రీ దేవీ ప్రొడక్షన్స్ వారి "భువనసుందరి కథ" కూడ నిర్మాణం పూర్తి అయింది. ఏప్రిల్ 7వ తేదీన యీ చిత్రాన్ని ఆంధ్రలో విడుదల చేయనున్నట్లు నిర్మాత శ్రీ తోట సుబ్బారావు తెలియజేశారు. యన్. టి. రామారావు, కృష్ణకుమారి, మిక్కిలినేని, ధూళిపాళ, ముక్కామల, ఉదయకుమార్, సత్యనారాయణ, వాణిశ్రీ, జయశ్రీ మున్నగువారు ముఖ్యభూమికలు పోషించారు. కథ వి. జి., సంభాషణలు: బి. ఎల్. ఎన్. ఆచార్య, సంగీతం ఘంటసాల, కెమెరా సి. నాగేశ్వరరావు, కళ: వాలి, దర్శకుడు సి. పుల్లయ్య.

* * *

శ్రీ ప్రొడక్షన్స్ వారి యూనిట్ ఊటీ వెళ్ళారు. ఈ షెడ్యూల్‌లో కాంచన, చంద్రమోహన్‌ల మీద ఒక పాట, కృష్ణ, కాంచన, చంద్రమోహన్‌లతో కొన్ని దృశ్యాలు చిత్రీకరిస్తారు. దీనితో సగం చిత్రం తయారవుతుంది. ఇంకా నామకరణం చేయని యీ చిత్రానికి సంభాషణలు భమిడిపాటి రాధాకృష్ణ రాశారు. సంగీతం: టి. చలపతిరావు, కెమెరా: యస్. వెంకటరత్నం, దర్శకుడు: వి. రామచంద్రరావు, నిర్మాతలు: సుందర్‌లాల్ నహతా, డూండీ.

* * *

డి. వి. యస్. ప్రొడక్షన్స్ వారు యీసారి ఒక సాంఘిక చిత్రాన్ని నిర్మించ దలిచారు. రచన డి. వి. నరసరాజు, సంగీతం టి. వి. రాజు, దర్శకుడు: యోగానంద్. నిర్మాత: డి. వి. యస్. రాజు. ప్రస్తుతం స్క్రిప్టువర్కు జరుగుతున్నది. ఈ చిత్రం కార్యకలాపాలు వచ్చేనెల చివరిభాగం నుంచి ఆరంభమవుతవి.

— మోహన్‌కుమార్



"ప్రాణమిత్రులు"లో నాగేశ్వరరావు, కాంచన.

అఖిలాంధ్ర ప్రేక్షక మహాశయుల
ఆదరాభిమానాలను చూరగొన్న
అపూర్వ చలన చిత్రం..











# విశ్వశాంతి
వారి

# కంచుకోట

నిర్మాత: U. విశ్వేశ్వరరావు B.Sc.

దర్శకత్వం: C.S. రావు బి.ఎ.(ఆ): సంగీతం: KV మహదేవన్



డిస్ట్రిబ్యూటర్స్:
ఆంధ్ర: జోతీపిక్చర్స్ నైజాం: వాణీఫిలిండిస్ట్రిబ్యూటర్స్ సీడెడ్: జయలక్ష్మిపిక్చర్స్
మైసూరు: సదరన్‌మూవీస్ గుంటూరుజిల్లా: విశ్వశాంతిడిస్ట్రిబ్యూటర్స్ : విజయవాడ.
నెల్లూరుజిల్లా: మాధవీపిక్చర్స్ · నెల్లూరు. (జోతీ రిలీజ్)

JOTHEE PUBLICITIES

వైజ్ఞానిక గాథావళి-96

# రాకెట్ల కథ

జియాల్ కోవ్‌స్కీ



రాకెట్లంటే తారాజువ్వలు. తారాజువ్వకు క్రింది కొసలకి నిప్పు ముట్టిస్తే మందు పొడుము కాలిన గాలులు బుస్సుమని కిందికి వస్తాయి. దిగువ వైపు మంట గాలులు పోవడానికి దారి గాని లేక పోతే, జువ్వని వేడిగాలులు లోపలినుంచి బయటకి నొక్కుతాయి జువ్వ గొట్టపు గోడప్ర. ఒత్తిడి అన్నివైపులకూ వుండడముతో మొత్తంగా కదలిక ఏదీ వుండదు. కిందివైపు వేడిగాలులు దూసుకు వచ్చేయడములో పై వైపు నొక్కే వేడిగాలులు పూర్వపు ఒత్తిడికి సమానమైన ఒత్తిడి దిగువ వైపు లేక, జువ్వని పైకి తీసుకు పోతాయి. గాలులు క్రిందికి దూసుకు రావడము ప్రతిక్రియ. కనుకనే రాకెట్లు 'ప్రతిక్రియ' వల్ల దూసుకు పోతాయన్న వివరణ వచ్చింది.

చైనీయులూ రష్యనులూ చిరకాలంగా ఇలాటి రాకెట్లను యుద్ధాలలో ఉపయోగించి శత్రు సేనల స్థావరాలకు అగ్గి ముట్టించేవారట. ఏరోప్లేనులు నిర్మించ బడిన తర్వాత వాటి ఎగురుడుకి గాలి అవసరము కావడము దాటరాని గిరి అయిపోయి వైజ్ఞానికులకు గాలి అవసరము లేకుండా ఆకాశగమనం చేసే ఆయుధాన్ని నిర్మించే అవసరము ఏర్పడింది.

రష్యన్ వైజ్ఞానికుడు జియాల్ కోవ్‌స్కి సాధారణ సాధనముగా కాక ఆకాశయానము చేసే సాధనంగా రాకెట్లను తీర్చవచ్చునని లెక్కలు వేసి చూపించాడు. రాకెట్లలో దీపావళి టపాకాలలో లాగ— మందు పొడుము వాడితే అది చాలా బరువైపోతుంది. ఒక్కొక్క సెకనుకీ రాకెట్లునుండి బయటికి— కిందికి—దూసుకు వచ్చే గాలుల బరువును ఆ గాలుల వేగంతో హెచ్చవేస్తే, గాలుల గతి భారము (momentum) వస్తుంది. పైకి వెళ్ళే రాకెట్ గతిభారము కూడా సరిగ్గా ఇంతే అవుతుంది. రాకెట్‌ని నిర్మించేసిన తర్వాత దాని గాలుల గతి భారము అంత అని స్థిరమైపోతుంది గదా? ఇంతే గతి భారముతో వుండే రాకెట్ యొక్క వేగమును పెంచాలంటే, (గతిభారమన్నది దాని బరువు × వేగమూ కనక) రాకెట్ మొత్తపుబరువుని వీలైనంతగా తగ్గించేయాలి. మరి, బరువు తగ్గించాలంటే రాకెట్ డోలక బరువును మాత్రము తగ్గించలేముకదా?— పొడుము బరువుకి పెరిగి పోతుంది.

పెట్రోలూ ఆక్సిజను ద్రవమూ వాడి పెట్రోలును ఆక్సిజను చేత మండిస్తే రాకెట్‌నుండి కిందికి దూసుకు వచ్చే గాలుల వేగమూ బరువూ కూడా— పొడుము వాడినప్పటికంటే—ఎక్కువ చెయ్యవచ్చును. అయితే ఆక్సిజను ద్రవమును పొయ్యడానికి రాకెట్‌లో థర్మాసు ఫ్లాస్కుల వంటి పీపాలు వాడాలి. లేకపోతే ఆక్సిజను ద్రవము రాకెట్ బయటి గాలి వెచ్చదనానికి మరిగిపోయి దాని ద్వారా ఏర్పడ్డ ఆక్సిజను వాయువు రాకెట్‌ని నేలమీదే పేల్చేస్తుంది. ఇలాటి చిక్కులెన్ని తంటాలు పడి ఇంజనీర్లు దాటే టప్పటికి, ఎన్నియత్నాలు చేసినా రాకెట్‌ని సెకనుకి 7 మైళ్ల వేగముతో మాట లేమని తేలి పోయింది.

ఈ "సెకనుకి 7 మైళ్ళు అన్నదాని ప్రాముఖ్యము ఏమిటి? అని అడుగుతారు చదువరులు. మనవి చేస్తా, కొంచెము శ్రద్ధపెట్టి గ్రహించండి.

నేల బారుగా విసరిన రాయీ, పేల్చిన తుపాకి గుండూ, ఫిరంగి గుండూ కొద్ది సెకనులలోనే నేలమీద పడిపోతాయి. భూమిపైన నిరాధారంగా ఉన్న ప్రతివస్తువూ, మొదటి సెకనులో 16 అడుగులూ, రెండు సెకనులలో మొత్తం 64 అడుగులూ, అలాగ— కిందకి పడిపోతుంది. నేల బారుగా పేల్చిన ఫిరంగి గుండైనా, నేలబారుగ సెకనుకు ఎన్ని మైళ్ళు వెళ్ళినా, భూమివైపు ఆ 16 అడుగులూ, 64 అడుగులూ పడి తీర వలసినదే. పటములోనిది భూమి. 'కొ' అనే కొండ మీదనుంచి, ఫిరంగిని పేల్చాము. ఒక్క సెకనులో గుండు—భూమిగాని దాన్ని ఆకర్షించకపోతే—'ఖ' దగ్గరకూ రెండో సెకను చివరకు 'గ' దగ్గరకూ మూడో సెకను చివరకు 'ఘ' దగ్గరకూ ప్రయాణిస్తుంది. ఫిరంగి ఉన్న ఎత్తున భూమిచుట్టూ—కొండ ఎత్తుతో— సమానమైన దూరంలో చుక్కల గీత గీశాము / అనుకోండి. దూసుక పోయే ఫిరంగి గుండు, భూమి ఆకర్షణ వల్ల తాను పోతూన్నంత సేపూ భూమి 'కేం'ద్రము వైపు మొదటి సెకనుకి 16 అడుగులూ, రెండు సెకనులకు 64 అడుగులూ పడుతుంది కదా. ఇప్పుడు, 'కఖ' అన్నదూరము 16 అడుగులై 'గఘ' అన్నది 64 అడుగులై 'చఛ' అన్నది 144 అడుగులైనది, అనుకుందాము. ఫిరంగిని వదిలిన గుండు 'క' దగ్గిర ఉండ వలసినది, మొదటి సెకనులో 'కఖ' అంతదూరము భూమి(కేంద్రము) వైపు పడుతుందీ, రెండు సెకనులకు 'గఘ' అంత దూరము పడుతుందీ, మూడు సెకనులకు 'చఛ' అంత దూరము! మొత్తానికి పటములో చూపినట్టు మన ఎడమవైపుకి 'కగచ' అన్నటివంటి రేఖలో పోవలసిన గుండు 'ఖఘఛ' దారిలో బాణముఖము సూచించేటట్లుగా భూమిచుట్టూ తిరుగుతుంది. ఇలాగ తిరగాలంటే, గుండు ఫిరంగినుంచి సెకనుకు 7 మైళ్ళవేగంతో వెలువడాలి. !

రాకెట్లను కొండల మీదనుంచి నేలబారుగా



మీటరు. నిటారుగా నెత్తిమీదకి వెళ్ళేటట్లూ మీటరు. ఈరెండు దిశలకూ నడిమి దిశలో— కొంత కోణములో మీటుతారు. రాకెట్టు పయనిస్తూన్నంత కాలమూ భూమి వైపు— పైన చెప్పిన వరబడిని పడుతూనే వుంటుంది. అలాగ పడుతూ, దాని గమన దిశ భూమికి సమాంతరముగా దిగుతుంది. అక్షణానికి గాని దాని "నేలబారు వేగము సెకనుకి 7 మైళ్ళు ఉన్నదంటే రాకెట్టు భూమిమీద పడకుండా భూ ప్రదక్షిణము చేస్తుంది. వేగముగని సెకనుకు 7 మైళ్ళు దాటితే అది వర్తులమార్గంలో కాక, దీర్ఘవృత్త మార్గములో తిరుగుతుంది. రష్యను స్పూత్నిక్కులు ఇలాగే తిరిగేయి.

"రాకెట్టుకి ఆయెత్తున — గాలి రాపిడి తగలని ఎత్తున —నేలకు సమాంతరముగ సెకనుకు 7 మైళ్ళు దాటిన వేగము ఇవ్వడము సాధ్యమా అన్న సమస్యకు జియాల్కోవ్‌స్కి లెక్కలుగట్టి, 'సాధ్యమే' అని నిరూపించి చెప్పేడు. రాకెట్టుని ఒకే అంచిలో కాక మూడు అంచిలలో దాని లక్ష్యకు పంపవచ్చు నన్నాడు. అంటే మూడు రాకెట్లు ఒకదానికి ఒకటి గుచ్చి తయారు చేయడము. మొదట అడుగుది కాస్త, అది ఎత్తు

కలిసి వెళ్ళి గురుత్వాకర్షణ దాకా ఎత్తుకు వెళ్ళి, రాలి పోతుంది. ఇప్పుడు రాకెట్టుకి వేగము వుంది, బరువూ తగ్గుతుంది. రెండో రాకెట్టు ఇప్పుడు వెలిగి ఇంకా ఎత్తుకి, అలాగే మూడో రాకెట్టు అగి చివ్వరికి తిరగవలసిన కక్ష్యకీ ఎత్తుకు వెళ్తుంది అన్నాడు.

ఈనాటి రాకెట్లలో అన్నీ అదే పని చేస్తాంది. శక్తి తేమండే ఇంధనాలు మారాయి, రాకెట్టుని ఇటూ అటూ నడపడానికి తంత్రాలు నిర్మించారు. కక్ష్యలో తిరిగే రాకెట్టుని, దాని గమన దిశ వైపు ఏర్పాటు చేసిన పేరాషూట్ల వల్ల నెమ్మది గామిగా చేసి, క్రమంగా, భూమికి దింపే ఏర్పాట్లు నిర్మించారు. రాకెట్టు వేగానికి, భూమియొక్క దినభ్రమణ వేగమూ భూమికి సూర్యుడి చుట్టూ తిరిగే వేగమూ కలవాలంటే రోజులో ఒకొక్క ముక్కి మీటాలని, రాకెట్టు లో మనుష్యులను పంపాలంటే వాళ్ళని ప్రయాణపు తొలిదశలలోనూ కక్ష్య చేరిన తర్వాతనూ భారాతిశయానికీ భార రాహిత్యానికీ అలవాటు చెయ్యాలని గ్రహించారు.

చంద్రుడి చుట్టూ తిరగడమూ, దిగడమూ సాధ్యమే అంటున్నారు శుక్రుడు వంటి ఇతర గ్రహాలకు వెళ్ళడమూ సాధ్యమే. సూర్యకుటుంబాన్ని దాటి పోవాలంటే ఒట్టి రాకెట్లయితే పోతాయి గాని, లోపల మానవుణ్ణిగాని ఉంచితే వారిని చలివల్ల ఘనీభవింప చేసి పంపాలి, వారు ఏ ఖగోళ గ్రహాన్నైనా చేరేకాలానికి వారికి తెలివి తెప్పించాలి. ఇంకొక శతాబ్దము గడిచే వరకి అద్భుతాలు వినబడాలి! ●

# అరుణోదయం

(45వ పేజీ తరువాయి)

కౌగలుగుతాం?

"నిజాన్ని నిజంగా క్షణ క్షణం గుర్తుకు తెచ్చుకుంటూ ముందు జీవితంలో పొందుపు తినేదేమీ లేదు గనుక!"

"అదేంమాట.....నీకు కాలు లేకపోవటమే ఒకపీడ కల అనుకొని, ఇకముందంతా కాలు వున్నట్లుగా నడవగలుగుతావా?"

"చేస్తున్నదదేగదా మరి!" నవ్వాడు విజయం సాధించినట్లుగా.

"కాదు నీవెప్పుడూ అనుకోవటంలేదు. నిజమైన కాలు స్థానంలో చెక్క కాలును ఆసరాగా తీసుకున్నావ్...... దానితో జీవితాన్ని గడపటానికి తాపత్రయ పడుతున్నావ్....నీమనస్సంతా రెండుకాళ్లతోనూ నడుస్తున్న మనుష్యులను చూసి ఈర్ష్య నింపుకుంటున్నావ్!.......నీమీద నీవేజాలి కురిపించుకుంటూ కృంగిపోతున్నావ్...... అవునా? నిన్నునీవు వంచించుకుంటూ నా ప్రశ్నకు సమాధానంగా అబద్దం చెప్పవద్దు" గంభీరంగా అన్నది అరుంధతి.

ఆమె కంఠానికి అచ్చెరువొందాడు.

తను- కాదు—అని ఎలా అనగలడు?

ఓడిపోయి మౌనాన్ని ఆశ్రయించాడు.

"పిచ్చిబావా!" ఆమె తేలిక పడ్డట్లు నవ్వింది.

మాటమారుస్తున్నట్లుగా, "అరుణ పోషణ భారం నీమీద ఎందుకు వేసుకున్నావో నాకు అర్థం కావటంలేదు.!"అన్నాడు చిన్నగా.

"పోనీయ్ నీపోషణ భారాన్ని నామీద ఎందుకు వేసుకున్నావో నీకు అర్థమయిందా?"

రాజశేఖరం గుండె దడ దడ లాడింది.

అతడు సమాధానం చెప్పకపోవడంతో అరుంధతే "నీకు రెండూ ఒకేసారి అర్థమవుతయిగాని— మనస్సంతా పిచ్చి పిచ్చి ఆలోచనలతో ఖరాబు చేసుకోబోకు. దుప్పటి బిగించి పండుకొని నిద్రపో?!" అని ఫక్కున నవ్వి అరుంధతి తనపక్క మీద పడుకున్నది.

"అరుణ మీవారి తరుపు బంధువా?" మొండిగా ఇంకా ముందుకు పోసాగాడు తన ప్రశ్నలతో.

అరుంధతి మంచం మీద సగంలేచి చీకటిలో దోమతెర నడుమువున్న రాజశేఖరాన్ని చూడటానికి ప్రయత్నిస్తున్నట్లుగా కళ్లు చించుకు చూస్తూ.... "అవును, ఆయనకు మరదలవుతుంది...చాలా బీద కుటుంబం.... అంతేగాకుండా ఆమెను అనాథగా చేస్తూ, తల్లి దండ్రులు మరణించారు. అందుకనే నాదగ్గర చేర్చుకొని, ఆమెకు అక్కయ్యనయ్యాను!" అన్నది.

అలా అంటూనే, ఇక ఏమీ మాట్లాడటం ఇష్టం లేదన్నట్లుగా, అటు తిరిగి పడుకున్నది అరుంధతి!

*    *    *

"నీదగ్గర పేకవున్నదా అరుంధతీ!" అడిగాడు రాజశేఖరం.

సరిగ్గా పదకొండు గంటలయింది.

అప్పటికి గంట క్రితం అరుణ ట్యూషన్‌కు వెళ్లింది.

వెళుతున్న ఆమెను చూస్తూ అనుకున్నాడు: "పాపం రోజూ ఆమెను అంత దూరం ఎందుకు పంపాలి......ఆ చెప్పేదేదో తను చెప్ప గూడదా?.." అని ప్రశ్నించుకున్నాడు సర్వ సాధారణంగా.

"అవును! అనవసరమే!" అనికూడా అనిపించింది.

అదే అరుంధతికి చెబుదామనుకున్నాడు.

ఆరోజు అరుంధతి అడిగినపుడు, తను తొందరపడి అనుకోకుండా అలా అవేశాడు. తనమాటలకు అరుంధతి మనస్సు గాయపడింది. అందుకనే ఎన్నడూ ఆ విషయం ఆమె ముందు ఎత్తలేదు.

అరుంధతి ఎదురుగా పేము కుర్చీ తెచ్చుకు కూర్చొని, పేక మంచం మీద పడేసింది.

రాజశేఖరం పక్కగా వున్న స్టూలును మధ్యకు లాగాడు.

"నేను అరుణకు చదువు చెబుదామనుకొంటున్నాను." అన్నాడు ఉన్నట్లుండి పేకను కలిపే వాడల్లా ఆగి తలెత్తి.

అరుంధతి నిశ్చలంగా రాజశేఖరం ముఖంలోకి చూచింది.

"అది అంతగా నా కిష్టంలేదు!"

"ఎందుకని?" అన్నాడు ముందుకు వంగి.

"ఎందుకని అంటే— ప్రతి ప్రశ్నకు సమాధానాలు చెప్పటం కష్టం!- నాకిష్టం లేదు అంతే!" అన్నది గంభీరంగా.

"నీకెందుకు ఇష్టంగా లేదో నాకుతెలుసు. ఆరోజు నేనన్న మాటలు నీకు కష్టం కలిగించినయ్ కదూ?......అవునా?......"

"అయితే ఈరోజున ఈ ప్రసంగమూ నాకు కష్టం కలిగిస్తుంది..... నీవు మానుకుంటావా మరి."

దెబ్బతిన్నట్లుగా ఆమె ముఖంలోకి చూచాడు.

"అంతేకాదు... నాకు ఇష్టమయిన పనులు నిన్ను ఎన్నో చేయమంటాను...చేయగలవా?"—ఏదో అవకాశాన్ని జారవిడుచుకోవటం ఇష్టంలేదన్నట్టుగా తొందర పడుతూ అడిగింది.

"చేయగలిగితే—"

"నీవు ఆలోచించుకునే అవకాశం లేదు. నేను చేయ మన్నప్పుడు చేయాలి."

"అఫ్‌కోర్స్ ........ పరుగెత్త మంటే పరుగెత్తలేక పోవచ్చు!" ఫక్కున నవ్వాడు.

అరుంధతి మొఖం వివర్ణమయింది.

జాలిగా కన్నార్పకుండా, అలాగే అతడి వంక చూడ సాగింది. కళ్లను నీటిపొరల క్రమ్మి వేసినయి. ఒక్క సారి బాధగా కనురెప్పలు వాల్చటంతో అప్పుడప్పుడే గూడు కట్టు కట్టుకుంటున్న నీరు పట్టు తప్పి, చెంపల మీదగా గుండెలమీదకు జారినయ్.

"బావా!"

"అరూ! ... బాధపడుతున్నావా ?.." కంఠం గీరబోయింది.

"నీవు డాక్టర్‌వయి వుండవలసింది!"

"దేనికి?" వింతగా అడిగాడు.

"నీ చేత ఏదో వంక పెట్టి నాగుండె విప్పి కోయించుకుందేదాన్ని.. అప్పటికి నా జీవితంలో శాంతి లభించి వుండేది.!"

"అరూ!........"

"నీకు తెలియదు బావా, నా బాధ!..నేను.. నేను ఎవ్వరికీ చెప్పలేనిది.... చెప్పలేను గూడా ఎవ్వరికీ! నిజం....నీకయినా.., నీకయినా చెప్పగలుగుతానో లేదో....చెప్ప గలిగితే..... నేను నిజంగా ధన్యురాలినే!"

"నన్ను పరాయివాడిగా వూహించుకుంటున్నావా, అరుంధతీ!"

"నాకు ఈ ప్రపంచంలో నీకు మించిన ఆప్తు లెవరైనా వుంటేగా, అలా అనుకోవటానికి!"

రాజశేఖరం హృదయం ఆమె మాటలకు ఆనందంతో తుళ్లిపడింది.

కొద్ది కొద్దిగా అతడి ఆశలు బలం పుంజుకో సాగినయి. ఊహలు రూపాన్ని పొంద గానికి తాపత్రయ పడుతున్నాయి. కళ్లముందు గెనుకుంటున్న పిచ్చిపిచ్చిగీతలు సుమోగూడి అందమైన బొమ్మలై అందాన్ని పులుము కుంటున్నాయి.... అతడు ఆమె మాటలకు ఉత్తేజితుడయ్యాడు.

"అరూ!— ఆవేశంగా అన్నాడు.

గోపన్న వచ్చారు.

"ఏం గోపన్నా! బాడుగ ఏమీ లేదా?"

"లేదమ్మా!"

"అయితే, గులాబీకి పాదు బాగుచేద్దామా" "అంటూనె లేచి నిలబడింది." ఎందుకనో ఆ చెట్టున పువ్వులు సరిగ్గా పూయటం లేదు..........మళ్లీ ఎరువేదైనా తెప్పించి వేయాలిబావా! అన్నది" అంటూనే గోపన్న వెనకాలే బయటకు వెళ్లింది.

రాజశేఖరం మనస్సు మనస్సులో లేదు.

చేతిలోని పేకను ఊరికినే కలుపుతున్నాడు. దిక్కులు తోచనట్టు, ఆలోచనలకు అంతం లేదన్నట్టు ముక్కలను ఇష్టం వచ్చినట్టు పేరుస్తున్నాడు

ఉన్నట్టుండి ఒకముక్కను బయటకు లాగాడు !

రాజు!

మరోముక్క తీశాడు

రాణి!

కళ్ళు చించుకు ఆబొమ్మ మొఖం లోకి చూడసాగాడు ఆబొమ్మలో ఏదో అందం లోపించినట్లనిపించింది ఆమె మొఖాన్ని ఏదో బోసితనం కప్పి వేసివున్నట్లని పించింది. తరచి, తరచి చూచాడు. కళ్లముందుకు లాక్కున్నాడు. కళ్ళు రెప్పలు వుట్టేలా కన్నార్పకుండా పరిశీలించ సాగాడు.

లోపమేదో కళ్లకు కట్టినట్టయింది.

కళ్ళు ప్రఫుల్లమయినాయి.

పక్కగా కిటికీలో పెట్టివున్న కలాన్ని చేతికి తీసుకున్నాడు.

'రాణి' నుదుటిమీద కలంతో చుక్క పెట్టాడు.

"అరుంధతీ!" గొణిగాడు.

* * *

రాజశేఖరం ఆలోచనలనూ, ఆవేశాన్ని అరికట్టుకోలేక పోయాడు.

భావ పరంపరలు అతడిని ఉక్కిరి బిక్కిరి చేయగా, తనకు ఇన్నాళ్ళూ లేదనుకున్న, తనది కాదూ అనుకున్న తన ప్రియమైన సన్నిధి ఈక్షణంలో తనకతిసమీపంగా వచ్చి నిలచినట్టు తనదే అవబోతున్నట్టు ఊహించుకొని ఉవ్విళ్ళూర సాగాడు.

చిన్న అరుంధతి ఆమాట అనేటంత వరకూ తను చీకటిలోనే వున్నాడు. వెలుగును, అరుంధతి మనస్సును చూడలేక పోయాడు. ఇవని తనే దూషించుకున్నాడు.

ఒకస్త్రీ —అందునా, పరిస్థితుల ప్రభావంలో , సంఘం కట్టు బాట్లలో ఇరుక్కు పోయి— గిలగిల లాడుతున్న ఆమె యింతకు మించి ఇంకెలా చెప్పగలదు?

ఈలోగా ఎలాగైనా ఈ విషయాన్ని అరుంధతి ఎదుట తనకు తానుగా కదపాలి.

ఆమె వాడిపోతున్న చెంపల్లో కెంపులు చూడాలి.

కుంకుమ లేని కళావిహీనమైన ఆమె ముఖంలో తిరిగి కళాకాంతులు ప్రజ్వలింప జేయాలి.

ఆమె జీవితాన్ని తిరిగి మారేళ్ళ పంట చేయాలి.!

పిడికిలి బిగుసుకు పోయింది.

తన ఈ నిర్ణయాన్ని ఇంకెవ్వరూ అడ్డగించలేరు.

* * *

పదకొండు గంట లయింది.

రాజశేఖరం భోజనం చేశాడు.

అరుంధతి భోజనం చేసింది.

అరుణ ట్యూషన్‌కు వెళ్ళింది.

ఇల్లంతా— ప్రశాంతంగా,ఏదోగంభీరంగా - అరుంధతి మనస్సులా— ఆవరించినట్టుగా అనిపించింది రాజశేఖరానికి. మంచంమీద పడుకున్న తను క్షణక్షణానికి ఏదో తెలియని బాధతో కదిలే వాడిలా అటూ యిటూ కదులుతున్నాడు.

ఆవేశంలో ఉండి ఉండి ఒక్కసారిగా లేవబోతున్నాడు.

అరుంధతి అప్పటికే పక్క గదిలో మంచం వేసుకొని విశ్రాంతి తీసుకుంటున్నట్టుగా పడుకున్నది.

చివరకు, ఒక నిర్ణయానికి వచ్చిన రాజశేఖరం చిన్నగా లేచాడు.

చేతికర్ర తీసుకొని చంకకు తగిలించుకున్నాడు.

ఒక్కొక్క అడుగే అతి నెమ్మదిగా వేయసాగాడు.

అవతల గదిలో కాలు పెట్టబో తుంటే, ఒక్క క్షణం సంశయం ఆవరించగా, వళ్లంతా చెమటలు పట్టినట్లే ఫీలవ్వసాగాడు.

తాను పొరబాటు పడుతున్నాడేమో? అరుంధతిని తను తప్పుగా వూహించుకోవటం లేదు గదా?

మరో అడుగు వేసే టప్పటికల్లా తన ఆ వూహాలన్నీ పిచ్చి పిచ్చి ఆలోచనలే అనిపించింది.

ఆమెకు ఆవిషయం మనస్సులోలేక పోయినట్లైతే ఎప్పుడో మర్చిపోయిన తనను, ఇంట్లోనుంచి వెళ్లిపోయిన తనను ఎందుకు అంత తాపత్రయపడి పిలిపించుకుంటుంది. వెళ్లి పోతానన్నా అంత మొండిగా ఎందుకు ఉండమని బలవంతంగా _ అపుతుంది?

# అరుణోదయం

—మొఖమ్మీద చిరునవ్వు తళుక్కున మెరిసింది!

దబదబా మరే ఆలోచనా లేకుండా అడుగులు ముందుకు వేశాడు— ఎడంకాలు స్థానంలో వున్న కర్ర చిన్నగా 'టక టక' మంటుండగా!

అరుంధతి కళ్ళు మూసుకొని వున్నది. ఆమె మంచానికి అతిసమీపంగా వచ్చాడు మంచం పట్టిమీద ఒకచేయివేసి చంకకింద కర్రను తీసి పక్కన పెట్టాడు ఆవేశంగా ముందుకు వంగాడు.

నిద్రలో నవ్వుకుంటున్న అరుంధతి మొఖానికి దగ్గరగా తనమొఖాన్ని చేరుస్తూ నెమ్మదిగా, తీయగా, "అరూ!" అన్నాడు.

ఇంకొస్త ముందుకు వంగాడు. తన చెంపను ఆమెచెంపకు ఆనిస్తూ, "అరు!" అన్నాడు మరోసారి.

అరుంధతి ఉలిక్కి పడింది.

తనముఖంలో ముఖంపెట్టి వంగినవ్వుతూ చూస్తున్న రాజశేఖరాన్ని చూడటంతో కలవర పడిపోయింది. మొఖం పాలిపోగా పెదిమలు ఒణకసాగినయ్.

రాజశేఖరం మొఖాన్ని చటుక్కునతోసేసి ఎగిరి పక్కన నిలబడింది.

"బావా......!

రాజశేఖరం మొఖం సిగ్గుతో వాలిపోయింది.

ఇద్దరూ నిర్విణ్ణులయి నోటవెంట మాటరాక నిలబడి పోయారు.

చటుక్కున రాజశేఖరం, చంకకిందకు కర్రను లాక్కున్నాడు. వెనక్కు తిరిగాడు. తాగినవాడిలా తూలుకుంటూ ఇవతలి గదికి రాసాగడు.

అరుంధతి గొణిగింది. "నేనెంత అదృష్టవంతురాలిని......అరుణ గనుక చూస్తే ఎంత అభాసయివుండేది?"

రాజశేఖరం ఆ మాటలకు ఒక్కక్షణం కదలలేకపోయాడు!

అరుణ!...అరుణ గనుక లేకుండావున్నట్లయితే......?!

మొట్టమొదటిసారిగా అతడిలో అరుణమీద తెలియని అసూయా, ద్వేషం ఏర్పడినయి!

(ఇంకా వుంది)


Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1. Chief Editor: S.Sambhu Prasad.

Regd. No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA